

"కోటలో పాగ"లో ఒక దృశ్యం



"ఈ కాలం దంపతులు"లో ఒక దృశ్యం

## గ్లామర్ హీరోయిన్ ఎవరు ?

తెలుగు చిత్రరంగానికి ఆర్టిస్టుల కొరత బాగా కనిపిస్తుంది ఏ చిత్రనిర్మాణ సంస్థకు వెళ్లినా, హీరోయిన్ పాత్ర పెద్ద సమస్యగా పరిణమించింది

హీరో వర్‌షిప్‌తో చిత్రరంగం దినదిన ప్రవర్ధమానమవుతున్నది నిజంగాబట్టే, తీసే చిత్రాలలో కథానాయకులకు ఎక్కువ ప్రాముఖ్యత యివ్వవలసి వస్తుంది గ్లామర్‌పాత్ర పోషణకు సరయిన నాయిక కరువైంది

ఒక్క "కళాభినేత్రి" ఎన్ని చిత్రాలను చెయ్యగలదు ? గతేడువరకు 'గ్లామర్‌క్వీన్'గా ప్రశంసలందుకున్న నటికి నేడు ప్రజలలో పలుకుబడి తగ్గుతూవుంది

మిగిలినవాళ్లతో ప్రేక్షకుల ఓటు యిద్దరికి మాత్రమే యిస్తున్నారు ఒకరు జయసుధ, మరొకరు పద్మప్రియ ఈ యిద్దరూ రాత్రనక, పగలనక షూటింగుల్లో పాల్గొంటున్నారు గనక, ఎంతకాలం స్పేర్‌చేయగలరా అన్నది సందేహాత్మకంగా వుంది

కొత్తవాళ్లు కావాలి అని ఎప్పటికప్పుడు వెతుకుతూనే వున్నారు వచ్చినవాళ్లు నచ్చకనో, వచ్చిన అవకాశాన్ని రక్షించుకోలేకనో ఎవరూ అందకుండా పోతున్నారు

పదహారు – యిరవై వయసుగల అందమైన అమ్మాయిల ఆవశ్యకత చిత్ర పరిశ్రమకు ఎంతేని వుంది

మన నిర్మాతలు కొత్తవాళ్ల కోసం అన్వేషణ చెయ్యరాదు, అందాల భామలు దొరక్కపోరు

హీరో ఎవరా అని అడుగుతారేగాని, ఆయన సరసన నటిస్తున్నది ఎల్లమ్మయినా, పుల్లమ్మయినా ఒకలాగానే పరిగణిస్తారు మన ప్రేక్షకులు

నిజం చెప్పాలంటె, ప్రేక్షకుల్లో హీరోయిన్లకు "ఫాలోయింగ్" లేదు (కొంతమందికి తప్ప)



## మంజుల జుట్టు గోవిందా !

హాస్య నట నాయకుడు చలం, శ్రీ సారథీ స్టుడియోస్‌లో నిర్మించిన "తోటరాముడు" చిత్రాన్ని, కొందరికి చూపించారు

చిత్రం ఆద్యంతం హుషారుగా, వుత్సాహంగా సాగింది వినోదాన్ని అందించి, మనసుకు ఆహ్లాదాన్ని కలిగించింది సంభాషణం, సంగీతం పోటీ పడ్డాయి (పినిసెట్టి, సత్యం బలాబలాలను చూపెట్టారన్నమాట )

కొన్ని ఘట్టాలు కడుపుబ్బ నవ్వించాయి అవే గుర్తుకొచ్చేవిగా రూపొందించబడ్డాయి

జామకాయలు కోసిన అమ్మాయిల జుట్టును, తోట యజమానురాలయిన మంజుల కత్తిరించింది మంజుల జుట్టును, చలం కత్తిరించిన సన్నివేశం వుంది చూశారా చెక్కలయ్యేట్టు నవ్వాల్సిందే

తను ఏ పాపం చెయ్యలేదని ఎంత చెప్పినా, కన్నతల్లి, అన్నయ్య అంగీకరించనప్పుడు, యిల్లు వదలి వెళ్తూ, గడప దగ్గరున్న వదినమ్మతో 'నువ్వు నమ్మితే చాలమ్మా' అని నిష్క్రమించినప్పుడు చలం నటన అద్భుతం అనిపించింది అలాగే తల్లికి మస్తీ చేసినప్పుడు, యింటి కిటికీ గుండా అమ్మ చేతి ముద్ద తినిన ఘట్టంలో చలం అసాధారణంగా నటించాడు

హాస్యం, కరుణ, వీరరసాలతో నిండిన తోట రాముడుగా చలం అద్వితీయంగా నటించాడు

షావుకారు పాపారావుగా, త్యాగరాజు తేనె పూసిన కత్తి అనిపించాడు అన్నయ్యగా ప్రభాకర రెడ్డి, వదినగా వరలక్ష్మి, అమ్మగా పండరీబాయి, శకునిగా సాక్షి పాత్రలకు పూర్తి న్యాయం చేశారు

మాస్ పిక్చర్‌కు కావలసిన మసాలాలన్నీ రంగరించుకున్న "తోటరాముడు" నిర్మాతలు దుర్గాప్రసాదరావు, సూర్యనారాయణగార్లకు విత్తాన్ని ఆర్జించిపెడుతుంది దర్శకుడు బి వి ప్రసాద్, ఎడిటర్ అంకిరెడ్డిగార్ల కృషిని ప్రేక్షకులు అభినందిస్తారు

"తీర్పు"లో సుజాతాభగత్, సంగీత



29.2.93

# ఆరోగ్యం వున్న చోటే ఆనందం వుంటుంది
# హార్లిక్స్ కుటుంబాన్ని చూడండి.





## రోగ నిరోధక శక్తి కలిగించి రోజు రోజూ ఆరోగ్యం కాపాడుతుంది.

హార్లిక్స్ కుటుంబం ఆనందకరమైన కుటుంబం. పనిలోనూ, ఆటల్లోనూ—శక్తి ఉత్సాహాలు కలిగిస్తుంది. వారిని ఆనందోత్సాహాలతో వుంచేందుకు, సుచిత్ర వారి ఆరోగ్యం విషయంలో యెక్కువ శ్రద్ధ తీసుకుంటుంది. ప్రతి రోజూ వారికి సరైన పోషకాహారం హార్లిక్స్ ఇస్తుంది. "ఇది మా ఆరోగ్యభీమా" అంటుందామె.

హార్లిక్స్‌ని జీవనాధార మాంసకృత్తులతోనూ, బలవర్ధక పదార్థాలతోనూ, బలం, రోగనిరోధక శక్తి, అమిత శక్తి యిచ్చేట్టు తయారు చేశారు.

అంచేతనే సుచిత్ర వంటి గృహిణులు హార్లిక్స్‌ని నమ్మారు. కుటుంబం అంతా ఆరోగ్యంగా వుండేందుకు డాక్టర్లు సిఫార్సు చేశారు. ఇప్పటికి 100 సంవత్సరాలుగా సేవ చేస్తూంది.

"నేనెరిగి వున్న మంచి ఆరోగ్యవంతమైన కుటుంబాలు హార్లిక్స్ మీద ఆధారపడి వుంటాయి. సహజమైన మాంసకృత్తులూ, కార్బోహైడ్రేట్లూ, ఖనిజాలూ, విటమిన్లతో హార్లిక్స్‌ని తయారు చేశారు. ఇది రోగనిరోధక శక్తిని కల్గించి, నిన్ను మంచి ఆరోగ్యంతో వుంచుతుంది. తేలిగ్గా జీర్ణమయి, బాగా ఆరోగ్య లాభాలు కల్గించేట్టు ప్రత్యేకంగా రూపొందించారు.






**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్—మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డు ట్రేడ్ మార్కు.









ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 3-10-'75
రాక్షసనామ సం॥ భాద్రపదమాస బ. త్రయోదశి
*సంపుటము : 69 సంచిక : 4*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.

## విషయానుక్రమణిక

## అట్టమీద బొమ్మ

శ్రీప్రియ ముఖచిత్రముతో వెలువడిన 8—8—75 పత్రిక ఆకర్షణీయంగా ఉన్నది. కాని ఎక్కువ కొత్తతారల ముఖచిత్రాలు వేస్తున్నారు. పాత తారలవిఅంటే జమున, అంజలి, సావిత్రి, కృష్ణకుమారి మొదలగు వారిముఖచిత్రాలు అసలువేయటములేదు.

(మీ మా) పత్రికలో 'వారఫలం'శీర్షిక ఎందుకు వేస్తారో అర్థంకాదు. దానిలోఒక్కటి కూడా జరుగదు.

బి. శారదాదేవి, (ఉదయగిరి)

## సీ రి య ల్

గాజుమేడ సీరియల్ నన్ను ఎంతగానో ఆకర్షించింది, దూరదృష్టి లేక పిల్లలభవిష్యత్తు ఆలోచించక. ఉన్నఆస్తి దానధర్మాలు చేసేసి చేతులు ములిపికూర్చున్న భద్రయ్యలాటి వ్యక్తులకుకనువిప్పు కలిగిస్తుంది. కలిమిలేములు అనే అంతరాలు లేకుండా మంచి హృదయంతో, ఉషకుటుంబాన్ని ఆదరిస్తున్న ప్రభాకరం జోగమ్మ వంటివ్యక్తులు, స్వార్థపూరితమైన ఈ సమాజంలో వుంటారా, అనే సందేహం. ఇంత చక్కని సీరియల్ వ్రాసిన పోలాప్రగడ రాజ్యలక్ష్మిగారికి, అందించిన మీకూ నా హృదయపూర్వకాభినందనలు అర్పిస్తున్నాను.

వి. సూర్యకుమారి (ముంకలరెవు)

## క థ లు

29.8.75 సంచికలోని కథలన్నిఆణిముత్యాలే. 'వెల్లి వైలెక్కకమాత్ర', 'జాతకరహస్యం' మరియు 'ఆత్మహీనుడు' కథలు విన్నవయినా సందేశాత్మకంగాను, వాస్తవికతకు దగ్గిరగా ఉండడం వల్లను బాగా నచ్చాయి. సీరియల్సు 'రాగపిపికలు' మరియు 'గాజు మేడ' ఇంటరెస్టింగ్‌గా ఉన్నాయి. ఇంత మంచి కథలు, సీరియల్సు అందిస్తున్న మీకు మరియు రచయితలందరికి మా ధన్యవాదాలు.

— ఉమ, నిరూపా, పిషుల ఆండ్ రాజేందర్ సింగ్ (హైదరాబాద్)

5.9.75 సంచిక మాకు అంత తృప్తి నివ్వలేదు. కారణం: "తెల్లవారింది" యనే కథానిక రచయిత్రి చాలావరకు ఏర్పనే కలిగించింది. "మేనరికం" యనే కథానిక మమ్మలను మా కుటుంబ సభ్యులను ఎంతో సంతోషాన్ని కలిగించింది.

శ్రీమతి రాధా రాంబాబు, (నల్లగొండ.)

## సి ని మా

యూవద్భారత చలనచిత్ర రంగంలో ఒకేనటుడు విభిన్నమైన పాత్రలను పోషించడం 'నటరత్న'కు మాత్రమే సాధ్యము అని వ్రాశారు. మా అభిమాన నటి కుమారి వాణిశ్రీ ముఖచిత్ర (29—8—75) పత్రికలో సినిమాల శ్రీనివాస్. లోగడ నట సామ్రాట్ "నవరాత్రి" చిత్రంతో తొమ్మిది విభిన్నమైన పాత్రలను పోషించి యావద్భారత చలనచిత్ర నటులనే తలదన్నిన అగ్రనటునిగా నిలబడ్డ డన్న సంగతి మరి శ్రీనివాస్‌కి తెలియదేమో ?

న్యాయపతి రమేష్‌బాబు (బరంపురం, ఒరిస్సా)

# ఉత్తరాలు

## చవితి సంచిక

వినాయకుని ముఖ చిత్రంతో వెలువడిన వినాయకచవితి సంచిక బ్రహ్మాండంగా వుంది. 'చలపతి', 'స్కోరెంత?' కథలు వాస్తవానికి చాలా దగ్గరగా వున్నాయి. 'నవ్వు' కథ చిన్నదైనా నన్నెంతగానో నవ్వించింది. కార్టూనులు కడుపుబ్బ నవ్వించాయి. అమావాస్య వెన్నెల బోర్ కొట్టింది. వినాయకునితో మినీ ఇంటర్వ్యూ భలేబాగుంది. వినాయకచవితి సంచిక నన్నెంతగానే నవ్వించింది. ఎప్పుడూ ఇలాగే నవ్విస్తూ వుండాలని ఆశిస్తూ—

లక్ష్మీరాం (నిజామాబాద్)

* * *

వినాయకచవితి సంచిక మాకు హాస్యాన్ని ఆనందాన్ని ఇచ్చింది. గణపతి'75 (కార్టూను) ఎంతో హాస్యాన్నిచ్చింది. మినీ ఇంటర్వ్యూ గురించి వీరాజీగారు తెలియని విషయాలెన్నో తెలిపారు. స్కోరెంత నాటిక చాలా బాగుంది. 'నువ్వేమో లేవలేవు. నేనేమో దిగలేను. పరేం చెయ్యాలా—' అన్న హాస్యాన్ని వెంకట్ అందించినారు.

బి. బసవరాజు, సుబ్బారావు, వీరాజు, (జగ్గయ్యపేట)

* * *

వినాయక చవితి సంచిక చదివాను. వినాయకుని వాహనం నెమలియా !? అన్న శీర్షికలో వివరణ లేదు. అలాంటపుడు అదే పేరుతో ఎందుకు ప్రచురించారో తెలియదు. సినీతారల భక్తి గూడా వారి నటనలో ఒక భాగమే ననుకుంటాను. శ్రీనివాస్ బొత్తిగా '... రాయుడు' అయిపోతున్నారు. జయదేవ్ (50 వ పేజీ) మరియు మురళీరమణ (46 వ పేజీ) కార్టూన్లు కడుపుబ్బ నవ్విస్తున్నాయి. అంగీరస గారు గణపతులెందరో చాలా చక్కగా చెప్పారు.

నివేదిత, శాంతల (దేవరకొండ)

* * *

'వినాయకచవితి' సంచిక ముఖచిత్రం ఒకేరంగుతో వేసినా చాలా బాగుంది.

మొదటి పేజీ తిప్పగానే కన్పించిన 'రంగ్రావ్'గారి 'గణపతి' కార్టూన్స్ మమ్మల్నెంతగానో నవ్వించాయి. వినాయక చవితి కార్టూన్లన్నీ బాగానే ఉన్నాయి. వీటన్నింటికీ మించి "మినీ ఇంటర్వ్యూ" చదివి రెండు గంటలు నవ్వుకున్నాము. ఒకరోజంతా అందులోని వాక్యాలు పునశ్చరణ చేసుకోవడం - నవ్వుకోవడం.

"గణపతులెందరు ?" "వినాయకుని వాహనం నెమలియా ?" అన్న శీర్షిక ద్వారా మాకు తెలియని ఎన్నో విషయాలు చెప్పినందుకు మీకు, ... వారికి మా థాంక్స్. కధలలో "నవ్వు" ఎంతో చిన్నగా చక్కగా వుంది. అయి... కధకన్నా దానికి వేసిన ... బొమ్మను చూసి ఎంతగా నవ్వుకున్నామో చెప్పలేం.

కె. రాధ, కె. రమేష్, ఎ. ..., ఎ. ... లక్ష్మి, ఎ. శ్రీధర్, ఎ. ...

(ఎర్రగుంటపల్లి)



## డాక్టర్ సలహాలు

**ఎం. — వనపర్తి**

అన్నంగాని మరేదైనాగాని తిన్నప్పుడు తర్వాత 2 గం.లవరకు అవి నోటిలోనికి వస్తూంటాయి. నివారణోపాయము తెలుపగలరు.

ఇలా రావటం సాధారణంగా, జీర్ణ కోశంలోని మొదటి భాగమయిన అన్నవాహిక వ్యాపకంగా వాడబడే "కడుపు"లో జీర్ణశక్తులు తమ పనిని సక్రమముగా చేయలేక పోవటంవల్ల జరుగుతుంది. ఇకపోతే పై దానికి తోడుగా, అన్న కోశము (వాహిక) నుంచి చిన్న ప్రేవుల మొదటి భాగమునకు వెళ్లే మార్గంలో అవరోధం, ఏర్పడినప్పుడు, ఆహారం నిల్వ చేరటంవల్ల, కడుపులో వికారం, వాంతులలాగా నోటిలోకి ఆహారం రావటం జరుగుతుంది. జీర్ణం కావటానికి కనీసం 3 గంటల వ్యవధి కావలసి వున్నందున, ఇది పెద్దరోగం అనటానికి అవకాశంలేదు.

**కె. — కాకినాడ**

మా అమ్మాయికి 4 సం.ల వయస్సులో స్ఫోటకంవచ్చి ముఖమంతా మచ్చలు ఏర్పడినాయి. ఇప్పుడు ఆమె వయస్సు 17 సం.లు మచ్చలు పోయే అవకాశముందా ?

మశూచి అనే (పెద్ద అమ్మవారు) రోగం ఏవయస్సులో వచ్చినా, ఆరోగంవల్ల ఏర్పడిన మచ్చలు, గుంటలు మొదలయినవి దాదాపు జీవితాంతము ఉంటాయని మీకు తెలియక పోవటం విచారించ తగిన విషయం.

ఏదో కొద్దిగా నామమాత్రంగా తగ్గినట్లు, (కాలగతిలో) అనిపించినా మందులవల్ల మామూలు చర్మంలాగా అవటం అసంభవం. కొన్ని విదేశాలలో "ప్లాస్టిక్ సర్జరి," "స్కిన్ గ్రాఫ్టింగ్" మరికొన్ని పద్ధతుల ద్వారా కొంతవరకు పరిస్థితి మెరుగుపడుతుందని శాస్త్రజ్ఞుల అంచనా!

**కె. యస్. — విజయవాడ**

నాకు 18 సం.లు రెండువత్సరములనుండి నాకుడికన్ను నల్లగుడ్డు చూస్తుంటే ప్రక్కకు జరుగుతోంది. డాక్టరుచేత పరీక్ష చేయించుకొని జోడు వేయించుకున్నాను. నయమవుతోంది దీనికి కారణమేమిటో తెలియజేయండి.

'నిస్టాగ్మస్' అనే ఈ లక్షణం, దృష్టిలోపం ఉన్నవారిలో తరచూ కనబడుతుంది. జోడు వేయించుకొన్న తర్వాత కూడా ఇలావస్తూ ఉంటే, ఆజోడు సరిగ్గా నిర్ణయింపబడలేదని. అమరలేదని మాత్రమే అనుకోవలసివస్తుంది. ఆజోడు తీసుకొని, తిరిగి, ఏ నేత్రవైద్యులు పరిశోధించిన వైద్యునికి చూపండి. సరిగ్గా పరిశీలించి, వారు తగిన "పవర్" కల 'జోడు' వ్రాసి యిస్తారు.

—డా. కె. వెంకటేశ్వరరావు

# 177* రూపాయలకు మాత్రమే
# బ్రహ్మాండమైన, స్పష్టమైన శబ్దం

# 177* రూపాయలకు మాత్రమే
# తక్కువ బ్యాటరీ ఖర్చు, అందమైన ఆకారం




# 2 బ్యాండ్ల నెల్కో తాపీ

ఈ విషయాలను పరీక్షించి చూసుకోండి—

నెల్కో తాపీ యొక్క 950 mW మేక్సిమమ్ ఔట్‌పుట్ మీకు బ్రహ్మాండమైన శబ్దాన్ని యిస్తుంది.

నెల్కో తాపీ షార్ట్‌వేవ్ సెన్సిటివిటీ 10-20 μV/m వలన రేడియో స్టేషన్ ఎంత దూరంగావున్నా, మీకు స్పష్టంగా వినిపిస్తుంది.

నెల్కో తాపీ యొక్క కరంటు (Iq) కేవలం 16 mA గనక, రేడియో బ్యాటరీలు ఎక్కువ కాలం మన్నుతాయి.

214 రూపాయలకైనా సరే మీకు, బజార్లో యింతకన్న మంచి రేడియో దొరకదు.

ఇంకా 14 రకాల, ఇంత మంచి రేడియోలు, మీ నెల్కో డీలర్ దగ్గర దొరుకుతాయి.

## నెల్కో—ప్రియ మిత్రసమానం అతి విశ్వాసనీయం

Creative Unit-A 1988-Tel

* ఎక్సైయిజ్ పన్నులతో సహా. స్థానిక పన్నులు అదనం.

## ది నేషనల్ రేడియో & ఎలక్ట్రానిక్స్ కం. లిమిటెడ్,

**8092/1-2, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్-500003.**

# జీవనసంధ్య

## కాకాని కమల

*(గత సంచిక తరువాయి)*

ఎదురుగా వున్న నిలువుటద్దంలో ఇంకో సురేష్ నిలిచాడు. అత్యంత ఆధునికంగా సమ్మోహనంగా వున్నదా రూపం !... నిలువెత్తు భారీ విగ్రహం. నుదుటి మీదికి వ్రాలిన క్రాపు. కొంటెతనం ప్రతిఫలించే చురుకైన కళ్లు. మెత్తగా అద్దుకోవాలని పించే పెదవులు......ఈనాటి సినిమా హీరో లని తలదన్నేలా వున్నదా రూపం. షర్టుకున్న పై బొత్తములు విడివడి ఛాతీ విశాలంగా కనిపిస్తున్నది. గుండెలమీద ఎత్తుగా పరుచుకున్న జుత్తుని చేత్తో రాచుకుంటూ వచ్చి సోఫాలో కూర్చుని కాలింగ్ బెల్ నొక్కాడు.

మరు నిముషంలో హోటల్ బాయి పరుగు పరుగున వచ్చి నిలిచాడు.

"చూడు. నేను రూమ్ ఖాళీచేస్తున్నాను. బిల్ తెచ్చిపెడతావా ?" అన్నాడు.

"జీ... సాబ్" అని వెనుతిరిగిన వాడ్ని మళ్లీ పిలిచి "ఇదిగో ముందు నా సామానంతా ఆ సూట్‌కేసులో సర్ది పెడతావ్?" అంటూ పర్సులోంచి ఓమూడు రూపాయలు తీసి వాడికి "బక్షీష్" ఇచ్చాడు

సంతోషంతో ఆ కుర్రాడు చకచకా హేంగర్‌కి వున్న బట్టలు తీసి సర్దటం మొదలు పెట్టాడు.

మరో పావుగంటకల్లా హోటల్ వదిలి రోడ్డుమీదికి వచ్చి ఆటో ఎక్కాడు సురేష్. సురేష్‌కి కాలేజి సెలవలు వచ్చినప్పుడల్లా హైద్రాబాద్‌కి వచ్చి అన్నగారి హాస్టల్‌లో ఓ రెండు రోజులు గడిపి ఆ తరువాత దగ్గర్లోనేవున్న తమ వూరికివెళ్లటం మామూలే!

అన్నదమ్ము లిద్దరూ ఆప్యాయంగానే వుంటారు. తమ్ముడు కాస్త దుడుకు స్వభావంతో ఏదైనా మాట జారినా రమేష్ సర్దుకుపోతాడు సురేష్ స్వభావం చాలా చిత్రమైంది అంతట్లోనే కోపం వస్తుంది. ఆ కోపానికి తగినంత కారణంకూడావుండదు.

ఆసమయంలో ఎవరూ రెచ్చగొట్టకుండా వుంటే తనంతట తనే తగ్గిపోతాడు. వున్నట్లుండి ఆపేక్షకూడా అలాగే పుట్టుకొస్తుంది. నిజంచెప్పాలంటే అతను ఎంత మంచివాడో అంత చెడ్డవాడు కూడా !

చేతిలో సూట్‌కేస్‌తో లోపలికి వస్తున్న తమ్ముడ్ని చూడగనే రమేష్ ఆప్యాయంగా చెయ్యి అందుకుని లోపలికి తీసుకువెళ్లాడు. కాస్సేపు ఇద్దరూ కబుర్లు చెప్పకున్నారు. చటుక్కున సురేష్ దృష్టి టేబిల్ మీదవున్న సంధ్య ఫొటోపై పడింది.

"వదిన కులాసాగా వుందా?" అన్నాడు

"ఆ... బాగానే వుంది" అని నవ్వాడు రమేష్. అలా అంటున్నప్పుడు అతనికళ్ళలోని వెలుగుని సురేష్ గమనించక పోలేదు.

"వెళ్లిన వాడివి వెంటనే వచ్చేశావే వుండాల్సింది" అన్నాడు.

"ఆ! వీలులేదురా...అసలు టైములేదు" అన్నాడు విసుగ్గా రమేష్.

"ఇంకో రెండునెలల్లో పరీక్షలు ఇప్పట్లో మళ్లీ వెళ్లటం కుదర్దని మొన్న అనుకోకుండా వెళ్ళా" అన్నాడు మళ్ళీ అతనే. మౌనంగా విని వూరుకున్నాడు సురేష్. ఆతరువాత సోదరులిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ డైనింగ్ హాల్లోకి వెళ్ళారు.

సంధ్యకి బి. ఎ. పరీక్షలు దగ్గరికి వచ్చాయి. కాని ఆమెకి తెలియకుండానే ఒకోసారి రమేష్ ఆలోచనల్లోకి జారిపోతుంది. పుస్తకం చేతుల్లోనే వుంటుంది. కాని మనసు మాత్రం భర్త చుట్టూ పరిభ్రమిస్తూ వుంటుంది. ఈ మధ్య సంధ్య రెండు వుత్తరాలకి ఇంకా అతన్నుండి జవాబు రాలేదు.

"పని వత్తిడివల్ల నేను వెంటనే రాయలేకపోయినా నువు మాత్రం తరచూ వ్రాయాలి సంధ్యా. లేకపోతే నాకు చదువు మీద బొత్తిగా కాన్‌సన్‌ట్రేషన్ చిక్కదు" అన్నాడు రమేష్.

"తప్పకుండా రాస్తాను" అని మాట ఇచ్చింది సంధ్య. అందుకని అతను జవాబు వ్రాయటం ఆలస్యం చేసినా బాధపడదు. సంధ్య. కాని ప్రతిరోజూ అతన్నుంచి వుత్తరం కోసం ఎదురు చూట్టం మాత్రం మానదు.

ఆ రోజు రాత్రి పది గంటలు కావస్తున్నది.

రేడియోలో ఏదో 'నేషనల్ ప్రోగ్రాం' వస్తుంటే వింటూ కూర్చున్నారు రామ్మూర్తి కుటుంబ సభ్యులు.

"టక...టక్...టక్...ట..." తలుపు శబ్దం అయితే లేచివెళ్లి తలుపు తీసింది సంధ్య.

ఎదురుగా భర్త ! రమేష్!... చేతిలో చిన్న హేండ్‌బ్యాగ్‌తో నిలచివున్నాడు. ప్రయాణపు తాకిడికి క్రాఫ్‌చెదిరి అలసట సూచిస్తున్నవి. అయినా సమ్మోహనంగా వున్నది ఆ రూపం.

ఆనందంతో ఆమెకి క్షణం నోటమాట రాలేదు. దాహంతో నోరు ఎండుకుపోతున్న మనిషికి కొబ్బరిబొండంలోని తియ్యని నీరు లభిస్తే ఎలా అనిపిస్తుంది ? కేవలం వుత్తరం కోసం నిరీక్షిస్తున్న సమయంలో కోరుకున్న మనిషే వచ్చివేశాడు. ఆనందం కాక మరి ఏమిటి ?

ఆశ్చర్యం నుంచి తేరుకుని, ఆనందం నుంచి తెప్పరిల్లి...

"మీరా.. రండి !" అంటూ ఆప్యాయంగా చేతిలోని బ్రీఫ్‌కేస్ అందుకుంది. కలలోంచి త్రుళ్ళిపడినట్లుగ అయి ఆమెవెంట కదిలాడు.

"అమ్మా" అని సంధ్య పిలుస్తూ వుండగానే సీతమ్మ అల్లుడ్నిచూచి ఖంగారుగా లేచింది. వాలుకుర్చీలో పడుకున్న రామ్మూర్తి స్ప్రింగ్ ఇచ్చినట్లు లేచి "రావోయి ... అల్లుడూ... రా...రా ! కులాసానా" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

"చూడు సంధ్యా ! నువు అతని వుత్తరం కోసం ఎదురు చూస్తున్నావు. కాని అతనే నీకోసం వచ్చివేశాడు" రామ్మూర్తి మురిపంగా కూతుర్ని చూస్తూ.

తలెత్తిన సంధ్యకి భర్త కొంటెచూపులు గిలిగింతలు పెట్టాయి.

మరో అరగంటకల్లా స్నానంచేసి అత్తగారు పెట్టిన భోజనం ఆరగించాడు.

అతడు తనకోసం ఏర్పాటు చేసిన గదిలోకి వచ్చాడు.

గదిలో పందిరి మంచం. దానిమీద తెల్లటి దుప్పటి. ప్రక్కనే కిటికీలోంచి జాజిపందిరి మీదుగా వస్తున్న చల్లటిగాలి. తెల్లటి చీర... జడలో జాజులతో కవ్విస్తున్న సంధ్య !... ఇవన్నీ కలిసి అతడ్ని వివసుడ్ని చేశాయి. మెల్లిగా లైటుఆర్పి కిటికీ దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు.

బయట అంతా వెన్నెల పరుచుకుని వుంది. గుబురుగా విశాలంగా అల్లుకున్న జాజి

పందిరిలో అక్కడక్కగా మిగిలిపోయిన జాజి మొగ్గలు విరిసి వెన్నెల్లో ఇంకా తెల్లగా మెరుస్తున్నాయి. ప్రకృతి అంతా వెన్నెట్లో తడుస్తున్నది. చల్లగాలి మెల్లగా వచ్చి ఆ యువకుని చెంపల్ని తాకింది. కిటికీగుండా చొచ్చుకు వచ్చిన వెన్నెల అగదిలో కూడా కొస్త మేరకి పరుచుకుని వుంది.

అప్రయత్నంగా జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు.

సిగరెట్ తాగుతూ పరధ్యానంగా నిల్చున్న అతను సంధ్య రాకని గమనించనే లేదు !

మెల్లగా గాజుల చిరుసవ్వడితో జాజుల పరిమళాన్ని జోడించి, భర్త చేరువకు వచ్చిన సంధ్య మృదువుగా తన చేతిని అతనిభుజంపై సింది. కాని అతను ఎప్పటిలా ఆమెవైపుకు చూడకుండా అలాగే నిశ్చలంగా బయటికి చూస్తూ వుండి పొయ్యాడు.

సిగరెట్ కాలుస్తున్న భర్తకేసి క్షణం తెల్లబోయి చూసి........

"డాక్టరుగారికి ఈ అలవాటు ఎప్పట్నుంచి?" అంటూ అతని పెదవుల మధ్య వున్న సిగరెట్‌ని సుతారంగా తీసి బయటికి విసిరేసింది.

క్షణం త్రుళ్లిపడి సర్దుకున్నాడు...... "ఓ!... అదా ఈమధ్యనే"

"కొత్తగా ఈ అలవాట్లెందుకు చేసుకోవటం? పైగా డాక్టర్లు" అంది సంధ్య కించిత్ కోపంగా.

ఒక్కసారి సంధ్య కళ్లల్లోకి చూసి పట్టుబడి పోయినట్లు నవ్వి దృష్టి తిప్పుకున్నాడు. తన తప్పు తెలిసివచ్చి కొస్త కంగారుపడ్డాడు.

"లేదు సంధ్యా! ఈమధ్యనే అప్పుడప్పుడు సిగరెట్ తీసుకుంటున్నాను. రెస్ట్‌లెస్‌గా స్టడీస్ చేస్తుంటే బాగా విసుగ్గా వుంటున్నది. అందుకని కొస్త రిలీఫ్ కోసం" అన్నాడు సంజాయిషీగా.

"ఆఁ... ఇప్పుడు అలాగే వుంటుంది. రేపు వదలలేనంతగా పట్టుబడి పోతుంది." అంది.

"లేదు... ఒక్కనాటికి అలా జరగదు, పరీక్షలైపోతే దానిజోలికి పోనుగా" అన్నాడు. మళ్లీ కిటికీ బయటికి చూస్తూ నిల్చుండి పొయ్యాడు. సంధ్యని చూస్తుంటే అతని మనసులో సంచలనం రేగుతున్నది.

"కిటికీ బయట అంత బాగున్నదా?" అన్నది సంధ్య.

"లేదు." అని కళ్లతో నవ్వుతూ ఆమె కేసి తిరిగాడు.

"సంధ్యా" అంటూ బరువుగా పలికి ప్రక్కకి తిరిగి అమె కళ్లల్లోకి చూశాడు.

"ఊఁ..." అంటూ మత్తుగా అతని విశాలమైన ఛాతీమీద వ్రాలింది సంధ్య. అ క్షణంలో ఆతని హృదయంలోనుండి అనురాగం పొంగి పొరలింది. రెండుచేతులా ఆమెని గుండెల కదుముకుని మోహావేశంలో అందిన చోటంతా ముద్దులు కురిపించాడు. తన బలిష్టమయిన చేతులలో ఆమె వళ్లంతా తడిమి తడిమి తనలోనికి ఇముడ్చుకున్నాడు.

"ఎప్పుడు వచ్చినా ఒక్క పూట కూడా



# జీవన సంధ్య

వుండటం లేదు. రేపు ఫోంచేసి వెళ్లండి" అన్నది సంధ్య.

"కుదర్దు సంధ్యా. ఇప్పటికే చాలా టైం వేస్టు. నా పరిస్థితి అలాంటిది. ఇంక నీ... కోసం ఈ మాత్రంగా రావటం" అన్నాడు గాఢంగా తనలోనికి ఆమెని చేర్చుకుంటూ.

"... ... ..."

"... ... ..."

వచ్చినప్పుడల్లా అర్ధరాత్రిదాకా ఏవో కబుర్లు చెప్పేవాడు అతడు. ఈసారి మౌనం దాల్చటం, కాస్త అన్యమనస్కంగా వుండటంతో సంధ్యకి కొద్దిగా ఆశాభంగం కలిగింది. చదువు-ప్రయాణం...వీటితో అలసిపోయ్యారేమో అనుకుంది. అయినా వుండబట్టలేక అడిగింది ... "అప్పుడే నిద్ర వస్తోందా ?"

"లేదు."

"మ రి !? ఏ మి టి వచ్చినప్పట్నుంచి చూస్తున్నాను-ఈరోజు ఇంత పరధ్యానంగా వున్నారు" అంది లాలనగా.

మళ్లీ అతనిలో కొద్దిగా సంచలనం చెలరేగింది.

"ఓ !...అదా...ఎందుకో వంట్లో సరిగా లేదు సంధ్యా. చాలా అలసటగా వుంది. గాఢంగా నిద్రపోవాలని వుంది" అన్నాడు.

అతని క్రాఫ్‌లోనికి తన చేతిని ఆపేక్షగా నిమురుతూ మౌ నం గా వుండిపోయింది సంధ్య.

మెడిసిన్ చదవటమే చాలా శ్రమతో కూడిన పని. అది పూర్తిచేసి ఎం. డి. చేస్తున్నాడు. నిజంగా ఎంత శ్రమ? ఎన్ని సాధక బాధకాలకి ఓర్చుకోవాలి ? దానికి తోడు మనసుని పట్టిలాగే ఈ బాంధవ్యమొకటి.

"నిజంగా మగవాళ్లు ఎంత ధీరోధాత్తులయినా, స్త్రీ విషయానికి వచ్చేసరికి ఎంత బలహీనులో కదా!" అనుకుంది. "వెయ్యి సమరాల గెలిచిన వీరుడు కూడా వడతి కౌగిట్లో బందీనే" అన్న నార్లవారి మాట జ్ఞాపకంవచ్చి నవ్వుకుంది.

"మరీ అంత వీలుకాని పరిస్థితుల్లో ఇబ్బందిపడి రావటమెందుకు ? ఇంకో రెండు నెల్లు ఎలాగో గడిపితే అయిపోతుందిగా" అన్నది సంధ్య.

'నిజమే సంధ్యా ! కాని ఎందుకో ఈ మధ్య అస్తమానం నువ్వే తలపుకి వస్తున్నావు. నీ వైపుకి పరుగులెత్తే మనసుని పట్టుకోలేక నీ ... కోసం ... నీ కోసం వచ్చేశాను" అన్నాడు గుసగుసగా.

అతనికి తనపట్ల వున్న అనురాగానికి సంధ్య మనసు వుప్పొంగింది. గడియారం రెండు గంటలు కొడుతూ వుండగా ఆ నవ దంపతులు నిద్రలోకి ఒరిగారు.

ఆ తియ్యనిరేయి కరిగిపోయి తెల తెల వారుతూ వుండగా యథాప్రకారం అతడు లేచి వూరికి వెళ్లిపోయ్యాడు.

తన అలవాటు చొప్పున రాముర్తి వెళ్లి బస్‌స్టాండ్ వరకూ సాగసంపి వచ్చాడు.

*　　*　　*

సరిగ్గా ఈ సంఘటన జరిగిన వారం రోజులకి ఓ శనివారంరాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో తలుపు టకటక చప్పుడు అవుతుంటే సంధ్య లేచివచ్చి తలుపు తీసింది.

ఎదురుగా రమేష్ ! నిలువెత్తు విగ్రహం చిరునవ్వులు చిందిస్తూ నిలిచివుంది.

అనుకోని అతని రాకకి ఏదో సినిమా తెలుసుకోలేనంత ఆశ్చర్యంలోనూ, ఆనందం తోనూ అలాగే కళ్లు పెద్దవి చేసుకుని భర్తని చూస్తూ నిల్చుండిపోయింది సంధ్య. అతన్ని లోపలికి ఆహ్వానించాలన్న ఆలోచనగాని మాట్లాడాలన్న వూహగాని ఆమెకి ఆ క్షణంలో తట్టనేలేదు. ఓ నిమిషం సేపు భార్యకేసి చూసిన రమేష్ చివరికి తనే అన్నాడు......

"ఏమిటి ? ఇంతకీ నన్ను లోపలికి రమ్మంటావా వద్దా ?" అంటూ గౌరవగా భార్య బుగ్గమీద చిటికెవేసి, ఆమె భుజంమీద చేయి వేసి లోపలికి వచ్చాడు.

అప్పటికి ఈ లోకంలోకి వచ్చింది సంధ్య.

"దేవిగారికి అంత ఆశ్చర్యంగా ఉందా నా రాక?" అన్నాడు కొంటెగా రమేష్.

"వుండదా మరి? కనీసం వచ్చే ముందు ఓ వుత్తరం అయినా రాస్తే ఏంపోయింది" అంది చిరునవ్వులో.

రమేష్ నవ్వుతూ అన్నాడు. "అంత ముందుగా అనుకుని ప్రయాణం పెట్టుకొనే వైపే వుంటే ఒకటేం ఖర్మ పదివుత్తరాలు వ్రాసి వుండేవాడిని. నిజం చెప్పాలంటే నా ప్రయాణం సంగతి నాకే తెలియదు." అన్నాడు బూట్లు విప్పుకుంటూ.

"అవును పాపం. ఉత్తరాలు రాయటానికి టైములేని పెద్దమనిషికి ప్రయాణం చేసి రావటానికి టైము దొరుకుతుంది" అంటూ "అమ్మా" అని పిలుస్తూ లోపలికి వెళ్ళింది.

రామ్మూర్తి వూళ్ళో లేడు. సీతమ్మ వారకి వుంది. అల్లుడు వచ్చినపుడు తనకి అటువంటి యిబ్బంది రావటం ఆవిడకి చాలా అవమానంగా అనిపించింది.

"సంధ్యా! నువు ఇప్పుడు నా భోజనం కోసం ఏం ప్రయాస పడకు. ఏది వుంటే అది చాలు. నేను పళ్ళు తెచ్చాను చూడు" అన్నాడు.

భార్య సన్నిధిలో ఎప్పుడు మైమరుద్దామా అని అతని తనువూ మనసూ తపించసాగాయి. భుజాల మీదుగా బరువైన జడ కదుల్తూ వుంటే అటూ ఇటూ తిరుగుతున్న సంధ్యని చూస్తుంటే అతని మనసు ఎంత బంధించినా నిలవనంటున్నది.

అత్తగారిమీద కొంచెం కోపం కూడా వచ్చింది. "ఏమిటో ఈ పెద్దవాళ్ళదంతా చాదసం. పూర్ సెంటిమెంట్సు వీళ్ళా! సంధ్యని మాత్రం అలా కటిక చాపమీద పడుకోనియ్యను" అనుకున్నాడు.

అందం. అమాయకత్వం కలబోసిన సంధ్యని చూస్తుంటే అతని హృదయం అనురాగంతో వుప్పొంగి పోతున్నది.

కాని అనాటి ఆనందం అతనికి ఎంతో కాలం నిలవలేదు!...?

ఒక రాత్రివేళ సంధ్య హఠాత్తుగా లేచి లడిగింది. ఆసమయంలో అతను సంధ్య మృదువైన చేతుల్ని చెంపలకి ఆన్చుకుని ఆనందిస్తున్నాడు. ఆసమయంలో చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినదానిలా లేచి కొద్దిగా చేతులమీద వ్రాలి అంది.

"ఇంతకీ మీరు సిగరెట్ కాల్చటం మాని వేశారా లేదా?" అని అడిగింది భర్త కాలరు సవరిస్తూ.

"అదిసరే ముందిది చెప్పు. నేను సిగరెట్ కాలుస్తున్నానని ఎవరు చెప్పారు?" అన్నాడు నవ్వుతూ.

"ఎవరు చెప్పారూ!?" అంటూ ఆశ్చర్యం ప్రకటించింది. ఎవరు చెప్పటమేమిటి? ఆ రోజు స్వయంగా మీరు నా ఎదుటే కాల్చారు కదా!"

"నేనా!" అంటూ విస్తుపోతూ చూచాడు రమేష్.

"అవును మీరే. నన్ను మభ్యపెట్టాలని చూడకండి. బుద్ధిమంతుడిలా ఒప్పేసుకోండి ఇంతకీ ఇంకా కాలుస్తున్నారా మానివేశారా?"

"నేనెప్పుడు కాల్చాను సంధ్యా! నాకసలు అలవాటులేందే!?" అన్నాడు.

"ఊ...లేదా? క్రిందటిసారి వచ్చినప్పుడు ఈ కిటికీదగ్గర నిల్చుని కాల్చలే...పరీక్షలు. కాన్సన్ట్రేషన్ కుదరక అలవాటు చేసుకున్నానని చెప్పారుగా"

"నే...నా!?" అన్నాడు మళ్ళీ రెట్టిస్తూ విస్మయంగా రమేష్.

"ముమ్మాటికి మీరే...మీరే"

రమేష్ భ్రుకుటి చిత్రంగా ముడిపడింది.

"మొన్న వచ్చినప్పుడంటే..."

"బాగుంది అదికూడా నేనే చెప్పాలా? క్రిందటి శనివారం."

బలిష్ఠమయిన రమేష్ పిడికిలి మధ్యవున్న సంధ్య చెయ్యిపట్టు సడలింది. చరాలున లేచి కూర్చున్నాడు రమేష్.

"క్రిందటి శనివారం నేను రావటమేమిటి సంధ్యా. ఏమిటి నువ్వంటున్నది? లేక కలగన్నావా? నేరాక నేటికి సరిగ్గా నాలుగు వారాలు. అంటే నెల. తెలుసా! వారం వారం వచ్చే తీరిక నాకెక్కడిది? ఓప్రక్క పరీక్షలొస్తుంటే" అన్నాడు విసుగ్గా.

ఈసారి తృళ్ళిపడటం సంధ్య వంతయింది.

"నాలుగు వారాలా? కాదు కాదు. క్రిందటి వారమేకదా మీరు వస్తే."

"నాన్సెన్స్" అన్నాడు చిరాగ్గా పిడికిలితో పరుపు మీద గుద్దుతూ. సంధ్య మాట్లాడలేకపోయింది. జరిగిందేమిటి? అతను అంటున్నదేమిటి? ఆమెకి ఇదంతా ఏదో మాయలాగ గోచరించింది. ఏంచెప్పాలో ఏం చెప్పకూడదో అన్న సందిగ్ధంలో పడింది. క్రిందటి శనివారమే కదా అతను వచ్చివెళ్ళాడు. కాని తను రాలేదంటున్నాడు. తన కళ్ళు తన్ని మోసం చేస్తున్నాయా? లేక మనసు మభ్యపడుతున్నదా? అతను చెప్పేది నిజమయితే...మరి ఆ రోజు వచ్చిందెవరు? ఆమె మస్తిష్కం స్థంబించింది. మతి భ్రమించిన దానిలా భర్తకేసి వెర్రిచూపులు చూస్తూ వుండిపోయింది. ఎట్లాగో గొంతు పెగుల్చుకుని ...

'మీ...రు...మీరు చెప్తున్నది నిజమేనా?" అంది.

"అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమిటి? నువు చెప్పేది నిజమే అయితే ఆ వచ్చింది నేను మాత్రం కాదు" అన్నాడు కర్కశంగా. అంతవరకు నవ్వులు చిందించిన అతని వదనం అంతట్లోకే అప్రసన్నంగా తయారైంది.

ఇద్దరిమధ్యా కొంచెంసేపు మూగరాక్షసి లా మౌనం రాజ్యం చేసింది.

రెప్పలల్లార్చటం కూడా మర్చిపోయి నోట మాట రాకుండా వుండిపోయిన భార్యని జబ్బ పట్టి కుదిపి కుదిపి ఈ లోకంలోకి తీసుకు వచ్చాడు రమేష్.

గుచ్చి గుచ్చి ఆమెని అడిగి అసలు



విషయం తెలుసుకున్నాడు. ఆ లెక్కన ఆరోజు వచ్చింది రమేష్ కానేకాదు. సురేష్ కావచ్చునని తేలిపోయింది.

రమేష్ అసహనంగా పక్క మీంచి లేచి కిటికీదగ్గరికి వెళ్లి నిల్చున్నాడు

అదే నడక! అదే ఠీవి! అదే భంగిమ! కాని అతను తను కాదంటున్నాడు. భగవాన్ ...ఇదెలా సంభవం?

లేచి అప్రయత్నంగా అతని బనీయన్ తొలగించింది. కుడిపక్క అరచేతి వెడల్పున నల్లని పుట్టుమచ్చ. సంధ్యభర్త రమేష్‌కి కుడిపక్క సురేష్‌కి ఎడమపక్క సరిగ్గా అలాంటి మచ్చే వుంటుంది. వాళ్లు కవల పిల్లలుగా పుట్టినప్పుడు పొట్టకి పక్క భాగంలో చర్మం కలిసిపోయి వుండటంతో డాక్టర్లు ఆపరేషన్ చేసి విడదీశారు. అందువల్ల అక్కడ నల్లని మచ్చలు ఆనవాలుగ మిగిలిపోయాయి. ఆ గుర్తులు ఒక్కటే వాళ్లిద్దర్నీ పరిశగా గుర్తుపట్టగల తేడా. ఆ లెక్కన ఇప్పుడు ఎదురుగా వున్నది తన భర్త రమేషేనని రూఢిగా నిర్ణయించుకుంది సంధ్య.

అట్లయితే ఆరోజు వచ్చింది... సురే... భగవాన్!

ఆమె గుండెలు క్షణంసేపు కొట్టుకోవటం మరిచిపోయాయి. ఆ నాటి సంఘటన, అతని ప్రవర్తన మనస్సులో మెదిలింది...

"డాక్టరుగారికి ఈ సిగరెట్ అలవాటు ఎప్పట్నుంచి ?.. ..."

"మీ కంఠం అలా బరువుగా వున్నదేం?"

"ఎప్పుడు వచ్చినా సరదాగా ఉండేవారు. ఇవాళ ఇంత మౌనంగా వున్నారేం?"

"అయ్యో! అయ్యో!" అని నుదురు కొట్టుకుంది సంధ్య.

అవును. ఆనాటి అతని ప్రవర్తనలో మార్పు లేకపోలేదు. తను అసలు ఎందుకు గమనించలేకపోయింది? తన భర్త పరో తెలుసుకోలేనంతటి మూర్ఖురాలు ఎలా అయ్యింది? అతను వచ్చాడన్న సంతోషం. ఎప్పుడెప్పుడా అన్న ఆరాటమేగాని విచక్షణా జ్ఞానం లేకుండా ఎలా ప్రవర్తించిందిఅసలు? అయ్యో!.........

వేష భాషల్ని బట్టి మనుష్యుల్ని పోల్చుకోగలననే అనుకుంది గాని అంతరంగాన్ని గ్రహించలేని మూఢురాలు ఎలా కాగలిగింది?




పదని మ్రగ్గినుపొంది, అల్యూ
మినము నరొమ్మ్రె తనర్చును;
మానవత పెంపొందు మానిసి
అచ్చమగు మేల్కొంద:మ్మె

## జీవన సంధ్య

కళ్లుండి చూడలేని అంధురాలు అయిపోయిందా?.........

"సురేష్" అలా ప్రవర్తిస్తాడని కల్లో అయినా అనుకుని వుంటే తాను ఎంతో జాగ్రత్తగా మెలగి వుండేది. ఆ మనిషి ఇంట్లోకి రాగానే తన భర్తే అని రూఢిగా తెలిసినా కూడా ముందు ఆ షర్టు బనీను విప్పించి కుడివైపు ఆ నల్లటి ఆనవాలు వున్నదో లేదో శ్రద్ధగా గమనించి ఆ తరువాతే అతనితో మాట్లాడి వుండేది కాని కనీసం వూహల్లో కూడా సురేష్ ఇంతటి నయవంచకుడని, తన బ్రతుకుతో ఆటలు ఆడుకుంటాడని తను అనుకోలేదు అతనికి తనేం ద్రోహం చేసింది? అనుకున్న దేమిటి? జరిగిందేమిటి? జరగబోయే దేమిటి? అసలు ఇంతటి విషమ పరిస్థితుల్లోకి తన జీవితం ఎలా చిక్కుకుంది?

తల త్రిప్పి చూసింది. రమేష్ రాయిలాగ కూర్చుని వున్నాడు. ఆ కళ్లల్లో మునుపటి ఆపేక్ష లేదు. ఆప్యాయత అసలే లేదు. "నవ్వు" అంటే ఏమిటో అసలు తెలియనట్లుగా వున్నాయి ఆ పెదవులు. సంధ్య అతనికేసి చూసిన క్షణంలోనే అతను కూడా ఆమెకేసి చూశాడు కాని ఆ చూపుల్లో మునుపటి సున్నితత్వం లేదు. పనికిరాని వస్తువుకేసి ఎలాచూస్తారు? అలాగచూశాడు. భార్యాభర్త లిద్దరిమధ్య కొన్ని అంగుళాలు కూడా దూరంలేదు. కాని మనసులుమాత్రం కొన్ని వేల మైళ్ల దూరంలో వున్నాయి.

ఎప్పుడూ తెలతెలవారుతూ వుండగా వెళ్లే రమేష్ ఆ రోజు మూడవ ఝాములోనే వెళ్లిపోయాడు!

కన్నీళ్లమధ్య కరిగి పోవటం తప్ప పెదవి కదల్చలేక పోయింది సంధ్య.

"నిజంగా నాకేం తెలియదు ... నాకేం తెలియదు" అనిమాత్రం ఎలాగో అనగలిగింది. కాని రమేష్ ఏమీ జవాబు చెప్పలేదు. అత్తగారు నిద్రట్లోవుంటే, "నేను వెళ్ళానని చెప్ప లేపద్దు" అన్నాడు. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడిచి వెళ్ళిపొయ్యాడు కనీసం వెనక్కి తిరిగి కూడా చూడకుండా. అతను చీకట్లో అలా వడివడిగా నడిచి వెళ్ళిపోతుంటే సంధ్యకి హృదయంలోంచి దుఃఖం అలలు అలలుగా తెర్లి వచ్చింది కన్నీళ్లతో తలుపు దగ్గర అలాగే నిల్చుండి పోయింది. అవిరామంగా అశ్రుధారలు అలా చెంపలమీద జాలువారుతూవుంటే పంటితో పెదవి నొక్కిపట్టి బాధని దిగమింగుతూ శిలవేసినట్లు నిల్చుండి పోయింది.

దీనికి పర్యవసానం ఎలా వుంటుందో తల్చుకుంటే రక్తం గడ్డకట్టుకుపోతున్నది.

ఎదురుగా సురేష్ కనిపించితే టపటపా ఆచెంపా ఈ చెంపా వాయించాలన్నంత ఆవేశం వస్తున్నది. అతనిమీద ద్వేషం లావాలా పొంగుకున్నది. తక్షణం వరంగల్‌కు వెళ్ళి ఆ సురేష్ అన్న మనిషిని నామరూపాలు లేకుండా అంతం చెయ్యాలన్నంత కసి! కాని ఏమిచెయ్యలేని అశక్తతలో, కన్నతల్లికికూడా చెప్పుకోలేని నిస్సహాయతతో లోలోపలే కుమిలిపోసాగింది.

* * *

"అతను అంత చీకట్లోనే ఎందుకు వెళ్ళిపొయ్యాడే? నన్ను లేపనన్నా లేపలేదేమే!" అంటూ తల్లి అడిగినప్పుడు ఏదో సర్ది చెప్పింది తల్లిదండ్రులకి ఈ విషయం తెలిస్తే ఇంకేమయినా వుందా? అసలు నలుగుర్లో తల ఎలా ఎత్తుకు తిరగ్గలరు? అభిమానం, సిగ్గు వున్న ఆడపిల్లలు ఇటువంటి అవమానాలను ఎదుర్కొని ఎలా ఎదురు నిలవగలరు?

మొన్నటిదాకా తల్లిదండ్రి తన పెళ్ళి ఎలా అవుతుందా అని బెంగపెట్టుకున్నారు. కాస్త ఇప్పుడిప్పుడే హాయిగా వూపిరి పీల్చుకుంటున్నారు. అటువంటిది తన సంసారం కూలిపోనున్నదంటే వీళ్ళు సహించగలరా? అతి సుందరంగా వాళ్ళు నిర్మించిన తన భవిష్యత్ పునాదుల్తోసహా కదలనున్న దంటే వాళ్ళు భరించగలరా? ఈ ఎదురుదెబ్బకి తట్టుకుని

## కలిమి లేములు

'ధనమూల మిదం జగత్' అంటారు. ధనంవల్ల సాధించ సాధ్యం కానిది ఏదీ లేదని 'న హి తద్విద్యతే లోకే యదర్థేన న సిధ్ద్యతి' అనే రాజనీతి చెపుతున్నది. అందువల్లనే దరిద్రుడు ఏ పనినీ చెయ్యలేడు. దారిద్ర్యంకంటే మరణమే మేలైనదని

'దారిద్ర్యా న్మరణాద్వా
మరణం మే రోచతే న దారిద్ర్యమ్'

అని అతడు భావిస్తూ ఉంటాడు.

ఇది అందరూ ఎరిగిన విషయమే!

అయినా దీనికి వ్యతిరేకమయిన అభిప్రాయం కూడా లేకపోలేదు. కలిమికంటే లేమియే ఒక్కొక్కప్పుడు మేలని అనిపిస్తుంది.

ధనికులకు తృప్తి ఉండదు. ధనం ఎక్కువగా ఉన్నా ఇంకా సంపాదించాలనే కోరిక ఉంటుంది. "నన్ను నీవు పెంచితే నిన్ను నేను పెంచుతాను" అని ధనం అంటుందని లోకంలో ప్రసిద్ధి. ధనం అధికమైనకొద్దీ మదం ఎక్కువ అవుతుందట. 'ధన మెచ్చిన మద మెచ్చును' అని అనుభవజ్ఞుడైన కవి వాక్కు.




కుబేర పుత్రులైన నలకూబరుడూ, మణిగ్రీవుడూ గొప్ప శ్రీమంతులైనందున దుర్వ్యసనాలకు లోనయి, మదించి, కన్ను గానకుండా ఉండడం చూచి, నారదుడు ధనంవల్ల కలిగే చెడుగును ఈ విధంగా తెలియచేసినట్లు ఉన్నది. ఆ సందర్భంలో పోతన్నగారి పద్యం —

'సంపన్నుం డొరుల గానలేఁడు తనువున్
సంసారమున్ నమ్మి హిం
సింపంజూచు దరిద్రుఁ డెత్తువడి
శుష్కీభూతుడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ
జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధుల కంజనంబు వినుమా
దారిద్ర్య మూహింపఁగన్.'

ధనవంతుడు ఇతరులను చూడడు. అతడు తన దేహాన్నీ, తన సంసారాన్నీ శాశ్వతాలని నమ్ముతాడు. ఇతరులను హింసించడానికే చూస్తాడు. దరిద్రుని సంగతి వేరు. అతడు చెడి, చిక్కిపోయి ఉంటాడు. ఎవ్వరినీ హింసించడు. అందరినీ తనతో సమంగా చూస్తాడు. దారిద్ర్యం అనుభవిస్తూ ఉన్నప్పుడే - ఐశ్వర్యంవల్ల కన్నులు కానరాకుండా తిరిగేవారికి కొంత జ్ఞానం కలుగుతుంది. కన్నులు కనబడనివానికి అంజనం పెడితే తిరిగి కన్నులు కనబడే విధంగా ధనవంతుడు సరియైన పద్ధతిలో నడుచుకోడానికి దారిద్ర్యాన్ని అనుభవించవలసి ఉంటుంది.

శ్రీమంతుడై ఉండుటకంటె దరిద్రుడుగా ఉండడమే సర్వవిధాలా ఉత్తమం.

ఇది ధనమందాధుల విషయమని గ్రహించాలి.

---

నిలవగలరా? భగవాన్!... ఎందుకు? నాలాంటివారి జీవితాలతో ఎందుకు ఆడుకుంటావ్? అసలు పెళ్ళే అవకపోయిన బాధపడకపొయ్యేదాన్ని. కానిఇంత అపహాస్యంగా ఎందుకు చెయ్యాలి?— అని తనలో తాను కుమిలి పోసాగింది.

భర్తనుంచి ఏదైనా వుత్తరం వస్తుందేమోనన్న ఆశ ఒక్కటే ఆమెని నిలిచేలా చేసింది. అంతగా రాకపోతే తనే రాద్దామని కూడా నిర్ణయించుకుంది. కాని ఏం రాయాలి? ఎలా రాయాలి? అన్న సమస్య ఎదురు నిలిచింది.

అయినా ఆమెకి అంతటి శ్రమలేకుండానే, సరిగ్గా రమేష్ వెళ్ళిన నాలుగు రోజులకి పోస్టుమాన్ నుంచి ఓ బరువైన కవరుని అందుకుంది సంధ్య.

కవరు మీద అడ్రస్ స్పష్టంగా లేదు. పైగా ఇంటి నంబరు తప్పు వ్రాసినందువల్ల సకాలంలో చేరక, అయిదారు రోజులు ఆలస్యంగా చేరింది ఆమెకు.

దడదడ లాడే హృదయంతో గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని స్థిమితంగా మంచంపై కూర్చుని కవరు విప్పింది సంధ్య.

* * *

"ప్రియమైన సంధ్యా ...

నిన్ను ఇలాగ సంభోదిస్తున్నందుకు ఏమి అనుకోకు. నాకు ఎందుకో నిన్ను "వదినా" అని పిలవటానికి మనసు అంగీకరించటంలేదు. ఇంతకీ ఈ వుత్తరం వ్రాస్తున్నది ఎవరనుకుంటున్నావ్? రమేష్ ... నీ ప్రియమైన రమేష్ కాదు. నీకు అప్రియమైన సురేష్! వరంగల్ నుంచి రాస్తున్నాడు.

సంధ్యా! నన్ను నీవు క్షమిస్తేనే గాని నాకు జీవితంలో శాంతి లేదు. అసలు విషయం సూటిగా చెప్తాను — ..." అంటూ అతను సుదీర్ఘంగా వ్రాసిన ఆ లేఖ చదువుకునేసరికి సంధ్యకి జీవితం మీద పూర్తి విరక్తి ఏర్పడింది. అంతవరకు భర్త తన్ని కావాలని అట్లా ప్రవర్తించాడేమో అన్న మినుకు మినుకు మంటున్న ఆశాదీపం కాస్తా ఆరిపోయింది. జీవితంలో చీకటి తప్ప ఇంకేది లేదనిపించింది.

సురేష్ రాసిన విషయాలు ఆమెలో పదే పదే గుర్తుకు రాసాగాయి. ... "సంధ్యా! మొదట్నుంచి నేను నిన్ను ఎంతగానో ప్రేమించాను. ఆ సంగతి నీకు తెలుసు. కాని నువు అన్నయ్యనే కోరుకున్నావ్. చివరికి మీ వివాహం అయింది. అన్నయ్య అదృష్టాన్ని చూసి ఓర్వలేకపోయింది నా మనసు. అప్పుడే నాలో ఇటువంటి దుష్ట ఆలోచన మెదిలింది..." బాధగా కళ్ళు మూసుకుంది సంధ్య!

"అయ్యో! సురేష్...నామీద ఎంత ద్వేషాన్ని పెంచుకున్నావ్? ..." అన్నయ్యకి ఒకరోజు ఫోన్ చేశాను. ఆ మర్నాడు శనివారం. అన్నయ్య నీ దగ్గరికి రావటంలేదని ధృడంగా తెలుసుకున్నాను. మర్నాడు నీ దగ్గరికి బయలుదేరాను. అన్నయ్యకి మల్లేనే హెయిర్ డ్రస్ చేసుకుని, తెల్లటి శ్లాక్ టక్ చేసుకుని అద్దంలో చూసుకున్నాను. ఆరూపం సురేష్‌ది కాదు. ముమ్మూర్తులా రమేష్‌దే! కొద్దిగా కమిలిన పెదవులు. కళ్ళల్లో ఏదును మిఁహాయిస్తే తేడా ఏంలేదు వెంటనే మీ వూరికి బయలుదేరాను ప్రయాణం జరుగుతున్నంతసేపు నా మనసు పరిపరి విధాల ఆలోచించి... ఎన్ని సిగరెట్లు బూడిదచేసి వుంటానో నాకే తెలియదు. చివరికి బస్ దిగి







మీ యింటి గుమ్మం మెట్లు ఎక్కాక కూడా వెనుతిరిగి పోదామనుకున్నాను. కాని నాచేతులు అప్రయత్నంగా మీ తలుపు తట్టాయి. తలుపు తెరిచి ఎదురుగా నువ్వు నిలిచావు. అప్పుడు నువు నా మనసు తృళ్ళిపడిన సంగతిగ్రహించి వుండవు. అప్పట్నుంచే నాలో విపరీతమైన సంఘర్షణ మొదలయింది. ఎప్పుడూ నిశ్చింతగా, వున్నంతలో హాయిగా జాలీగా వుండే నా బ్రతుకులో శాంతి కరువైంది......'' సంధ్య ఆవేదనతో గుండెలు రాచుకుంది. అవును సురేష్! నీ తృళ్ళిపాటును గమనించ లేదు. అందుకే నా బ్రతుకు తుళ్ళిపోయింది. నాకు మాత్రం శాంతి ఎక్కడిది? ఇంక నాకు అది ఎలా లభ్యమవుతుంది ? అనుకుంది అశాంతిగా... ... ...

"ఆ రాత్రి చాలా సేపటివరకు నిన్ను తాకటానికి సందేహించాను. అప్పుడు సయితం నిజం చెప్పి క్షమించమని వెనుతిరిగి పోదామనుకున్నాను. నాలో రగిలే తీవ్ర సంచలనానికి నా మనసు తట్టుకోలేక పోయింది. దొంగతనం, తప్పు అని తెలిసి తీరా ఆ పని చేస్తూ పట్టుబడి పోవటం అవివేక మనిపించింది. ఏదో అశక్తత నన్ను బంధించి వేసింది. నాలో మానవత్వం నశించింది. నా భుజంమీద చెయ్యివేసి జాజుల పరిమళంతో నన్ను చేరిన నువ్వు నాకు పరాయిగా, సోదరునిభార్యగా అనిపించలేదు. అంతే!......'' ఇంక చదవలేక పోయింది సంధ్య. వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ వుదృతం తగ్గాక మళ్ళీ దృష్టి

## జీవన సంధ్య

లేఖపై కేంద్రీకరించింది. ఎంత చదివితే మాత్రం ఏముంది? ఆ పది పేజీల వుత్తరం యొక్క సారాంశంఒక్కటే. తను అవివేకంతో చేసిన పనికి క్షమించమని. పదేపదే వ్రాశాను. అతనిలో మనశ్శాంతి కరువైందిట! అసలు అంత వెధవపని ఎలా చేశానా? అని పదేపదే బాధపడుతున్నాడట! జరిగిన అనర్థానికి సిగ్గుపడుతున్నాను. నీ దగ్గర్నుంచి వచ్చిన తరువాత చచ్చిపోవాలనిపించిన క్షణాలు ఎన్నో అని వ్రాశాడు.

"సంధ్యా! పశ్చాత్తాపంతో నా మనసు దహించుకుపోతున్నది. ఇక ముందు ఏ అనర్థాలు జరగకుండా వుండాలంటే ఈ నిప్పును నువ్వు నేను గుండెల్లో దాచుకుందాము. ఈ సంఘటనని పూర్తిగా మర్చిపో. ఈ విషయం అన్నయ్యకు తెలిస్తే పరిణామాలు ఎలా వుంటాయో వూహించలేకుండా వున్నాను. నీకోసం, నాకోసం, అన్నయ్య కోసం. ముఖ్యంగా అన్నయ్యకోసం. ఈ విషయం తెలిస్తే అన్నయ్య నిశ్చింతగా బ్రతగ్గలడా ? వాడసలే టూసెన్సిటివ్. సంధ్యా! నేను కోరుకునేదీ ఒక్కటే. నామూలాన నీజీవితం పాడు కాకూడదు.నాపాపానికి నేనే ప్రాయశ్చిత్తంచేసుకుంటాను. ఒకవేళ అన్నయ్యకి ఈ విషయం తెలిస్తే నన్ను క్షమించమని వాడికాళ్ళు పట్టుకుంటాను. నాతల తెగ్గోసి ఆరక్తంతో అన్నయ్య పాదాలు అభిషేకం చేస్తాను. అంతే గాని నీ జీవితం పాడుకావటానికి వీల్లేదు. మీరిద్దరూ కలతలు లేకుండా సుఖంగా బ్రతకాలి. ఇంకోమాట కూడా చెప్తున్నాను ఒకవేళ...ఒకవేళ అన్నయ్య నిన్ను స్వీకరించని పక్షంలో నీకు నేనున్నాను. అంతేగాని నీ జీవితం వాడిపోనివ్వను. ఇదంతా కుట్రపన్ని చేశానని నీవు దయయుంచి అపోహపడవద్దు. కుండెడు పాలని విరచటానికి విషపుచుక్క చాలు అన్నట్లు నేను చేసిన ఓ దుష్టపనికి నన్ను పూర్తి దుష్టుడిగా అనుమానిస్తే సహించలేను. ఈ సురేష్ హృదయంలోనూ అమృతం వుంది. నీ రమేష్ రక్తం పంచుకుని పుట్టినవాడే వీడూనూ. ఒక బలహీన క్షణంలో నేను చిత్తశుద్ధి లేకుండా చేసిన పనిఅది. అందుకు పదిజన్మల వరకూ బాధపడేటంతటి శిక్షే పడింది నాకు. ఈ విషయం అన్నయ్యకి తెలియకూడదు, అన్న ఆత్రతతోనే ఆలోచించి చివరికి తెగించి నీకు రాస్తున్నాను. నీవు నన్ను క్షమించాలి...''
అంతవరకు గుండెల్ని చిక్కబట్టుకున్న సంధ్య ఇంక దుఃఖోద్వేగానికి తట్టుకోలేక పోయింది. బాధతో కుప్పలా కూలిపోయింది. మనసంతా అల్లకల్లోలంగా, అస్తవ్యస్తంగా తయారైంది.

మూడురోజుల క్రితం భర్త అలా మొఖం చిట్లించుకుని నిర్లక్ష్యంగా తన మొఖం చూడటంకూడా ఇష్టంలేనంత అసహ్యంతో వెళ్ళిపోయి నప్పట్నుంచి ఆమె హృదయంలో విషపు జ్వాలలు రగులుకుని దగ్ధం చేస్తున్నాయి. లోలోపల కరుడుగట్టిన దుఃఖాన్ని దాచుకుని పైకి గంభీరంగా తిరుగుతోంది. ఈరోజు ఆ గంభీరత సడలిపోయింది. బేలగా వుత్తరాన్ని చేతులమధ్య పెట్టుకుని కన్నీరు మున్నీరుగా విలపించింది.

సురేష్! ఏం పనిచేశావు సురేష్? క్షమించాలా నిన్ను ? ఇది క్షమించేంతటి చిన్న తప్పా ఇది ? మీ అన్నయ్య నిన్ను క్షమించవచ్చు నేను నిన్ను క్షమించవచ్చు కాని మీఅన్నయ్య నన్ను క్షమిస్తారా ? లోకం నన్ను క్షమిస్తుందా ? నన్ను చూసి పదిమందీ నవ్వుకోరా ? ఒక అపవిత్రురాలిగా నన్ను వెలివెయ్యరా ? నీ ఈ అవివేకపు పని మా జీవితాల్ని బలితీసుకోకుండా వుంటుందని ఎలా అనుకున్నావు ? నిప్పుని దాచిపెట్టటం సాధ్యమయ్యేపనా ? ఎప్పటికైనా అది దగ్ధం చెయ్యదా ?

ప్రేమనుంచే ద్వేషం జనిస్తుందని అనుకోలేక పోయాను. ఏ అన్నయ్యా స్వీకరించని పక్షంలో నాకు నీవున్నానని అంటున్నావా ? ఈ సంధ్యని ఎంత తేలిగ్గా వూహించావ్ సురేష్ ? ఏదో ఒక విధంగా బ్రతకడమేనా ముఖ్యం ? నీతి, నియమం, మనసు, మమత ఇవేమీ అక్కర్లేదనుకున్నావా ?

కాబోయే ఇంజనీరువి! విరిగిన వంతెనలను కలుపుతావు. పెద్ద పెద్ద నదులపై ఆనకట్టలు నిర్మిస్తావు కాని రెండు పగిలిన మనసుల్ని అతకగలననే అనుకున్నావా? విరిగిన రెండు హృదయాల మధ్య మమతల వంతెన వేయగలననే అనుకున్నావా ?

ఈ పవిత్ర భారతదేశంలో ఒక మగవాడు తన భార్య విషయంలో విశాలత్వం చూపించిన సంగతి ఎక్కడైనా విన్నావా? భార్య శరీరమే కాదు...... కేవలం ఆమె మనసు అపవిత్రమైనదని తెలిసినా కూడా సహించలేని పురుషుల ప్రపంచ మిది. అటువంటిది పూర్తిగా ఒకరాత్రి మరోవ్యక్తితో గడిపిన భార్యని ఎంతటి వున్నతుడైనా స్వీకరించగలడా ? ఒకవేళ స్వీకరించినా నిండు మనసుతో ఆమెని ఒక్కనాటికి హృదయంలోకి చేర్చుకోగలడా ? అటువంటిది, నేను ఇంత జరిగినా ఇంకా నా భర్తతో కాపురం చెయ్యటం ఎలా సంభవం? ఇంక నాకు ఏం మిగిలింది? ఈ విషాదంతో, ఈ అశాంతితో రోజులు దొర్లించకపోతే మాత్రం వచ్చిన నష్టమేమిటి ? ఈ విశాల విశ్వంలో సంధ్య అనే ఒక మనిషి లేకపోతే వచ్చే అవాంతర మేమిటి?'' అంటూ కన్నీరు

## బట్టబయలయిన రహస్యం

మద్రాసు రాయపేట ఆసుపత్రికి చికిత్స కోసం వచ్చిన ఓ పదిహేనేళ్ల బాలుణ్ణిచూసి డాక్టర్లు కొయ్యబారిపోయారట. ఆ పదిహేనేళ్ల బాలునికి రెండు జననాంగాలు ఉన్నాయట. ఒంటేలు పోసుకోడానికి ఒకటే ఉపయోగంగా ఉందట. తత్సంబంధమయిన బాధ చికిత్స కోసమే ఆతను ఆసుపత్రికి వచ్చాడట. రెండు జననాంగాలు, ఒకే మూత్రపిండమూ ఉన్న అతనికి. రెండు జననాంగాలుండటం చాలా అరుదయిన విషయమనీ, అరవయి లక్షల మందిలో కనీసం ఒక్కడికయినా ఇలా రెండు జననాంగాలు ఉండవనీ ఆసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ గోవిందస్వామి ప్రకటించారట. అతను పదిహేను ఏళ్లకాలం ఎలా పెరిగాడు. ఈ వింతను ఇన్నేళ్లు అతని తలిదండ్రులెలా దాచారు! ఏమో!!

* * *

మైసూరు విశ్వవిద్యాలయం సిండికేట్ సమావేశం హాజరై, తిరిగి బెంగుళూరు వెళ్తున్న వి. లంజప్ప అనే ఆయన కారును టి. వి. ఎస్. వారి లారీ గుద్దిందట. దాంతో 52 ఏళ్ల లంజప్పగారు, ఆయన కారు డ్రయివరూ అక్కడికక్కడే చనిపోయారట. ఆయన కర్ణాటక శాసనమండలి మాజీ సభ్యుడట. ఈ ప్రమాదం [illegible] ప్రాంతంలో జరిగినదట.

## పసి ఛాతీపై గుండెకాయ

ఆగస్టు ఏదో తేదీన పెన్సిల్వేనియాకి చెందిన అలెన్‌టౌన్‌లో ఓ ఆసుపత్రిలో పుట్టిన పసిపిల్లవానిగుండె శరీరం బయట ఉన్నదట.



ఏ ఆచ్ఛాదనా లేక, మాంసపు ముద్దవలె ఉన్న ఆ గుండె ప్రసవ సమయంలో ఏ రాపిడి లేకుండా తట్టుకున్నదట. ఈ గుండెకాయను శరీరం లో పెట్టి శస్త్ర చికిత్స చేయాలని వైద్యులు సుమారు ఆరు సార్లు ప్రయత్నించి, లోపల గుండెకాయ పట్టే జాగా లేక ఆ పని విరమించు కున్నారట. ఆ పిల్లాడిని ఆగస్టు 27వ తేదీన ఫిలడెల్ఫియా పిల్లల ఆసుపత్రికి తీసుకునివస్తే, అక్కడి భారతీయ డాక్టరు సక్సేనా అనే ఆయన గుండెల మీది చర్మం సాగదీసి, దానితో ఆ గుండెకాయకు ఆచ్ఛాదన కలుగజేసి, ఆపరేషను విజయవంతంగా చేశారట. ఈ పిల్లవానికి ఛాతీ మీద ఆ గుండెకాయ ఎత్తుగా కాయవలె కనుపిస్తూ ఉంటుందిట. గుండె తన పనిని చక్కగా చేస్తున్నదని సక్సేనా అన్నారట. ఇదే విధంగా రెండొందల మంది శిశువులు పుట్టినట్లు ఆసుపత్రి రికార్డులలో ఉందని, అయితే ఎవ్వరూ కూడా రెండ్రోజులకంటే బ్రతికినట్లు లేదనీ ఆసుపత్రి డాక్టరన్నారట.

## ధర్మాత్మురాలి హత్య!

తాడికొండకు చెందిన 73 ఏళ్ల యశోదమ్మ అనే ఆవిడ తనకున్న ఆస్తినంతా యధాశక్తి దానధర్మాలకు ఉపయోగిస్తోందట. ఇది గిట్టని ఆమె అల్లుడు సీతారామయ్య ఏలూరులో చదువుతున్న తన కొడుకు సహాయంతో 24వ తేదీ యశోదమ్మ పీకనొక్కి ఆమెను చంపి, చేతి కందిన నగానట్రా డబ్బూదస్కం పట్టుకు పోయారట. అంతేగాక, అతి తెలివిగా ఎవరో తన అత్తగారింట్లో పడి, ఆమెను చంపి నగ నట్రా ఎత్తుకుపోయారని పోలీసులకు తెలియజేశారట. వారు కుక్కలతో వస్తే అవి సీతారామయ్యనే పట్టుకుని, నిజం కక్కించాయట.

## ముష్టివారి నిర్మూలన!?

అక్టోబరు రెండు నుంచి తమ నగరంలో ముష్టివారుండరాదని, అలా ఎవరయినా రూలు నతిక్రమించి వచ్చితే వారిని పట్టుకుని నగరపాలక సంఘం ఆధ్వర్యంలో ఉండే శరణాలయాలకు పంపుతామని, బలమూ, వయస్సూ కలిగిన ముష్టివారికి, పనిచేయగలిగినవారికి, పనులు కలిగించి ముష్టెత్తడం నిర్మూలిస్తామని కాలికట్ నగరపాలక సంఘం ప్రకటించిందట.

* * *

యాభయిమూడేళ్ల యువకుడైన ప్రసిద్ధ నటుడు, దర్శక నిర్మాత యన్టీ రామారావు ఇప్పటికి రెండు వందల డెబ్బయి చిత్రాలలో కథానాయకుని వేషం వేశారట. బహుశా యిది మన దేశంలోనే గాక ప్రపంచంలోనే రికార్డట. ఇండియాలో అయితే ఇహ ప్రపంచమంతటా ఒప్పేసుకోవచ్చు. ఎన్. తాను వెస్ట్ జర్మనీ నుంచి సినిమా స్టూడియోకి సంబంధించిన పరికరాలు పదిహేను లక్షల రూపాయిలు పెట్టి కొన్నట్టూ, హైదరాబాద్‌లో తాను కట్టమన్న

---

కన్నీరుగా వుండిపోయింది సంధ్య.

* * *

సూర్యుడు పూర్తిగా పశ్చిమాద్రికి నిష్క్రమించాడు. పల్చగా సంధ్యవెలుగు పరుచుకుంది. పూర్తిగా సూర్యుడు నిష్క్రమించాక చంద్రోదయం కాకపూర్వమే జగమంతటా పరచుకునే ఆ సంజె వెలుగులో అందంగా మనోహరంగా ఆహ్లాదంగా ఉంటుంది. ఆ సంధ్యా సమయపు అందానికి పరవశించని వారు అరుదు. కాని పాపం ...

## జీవన సంధ్య

అటు సూర్యునికి కాక ఇటు చంద్రునికి కాని ఆ సంధ్య బ్రతుకు ఎంత అల్పమైనది? ఎంత నిరుపయోగమైనదో కదా! ఆ బాధ మనకి అర్థం కాదు. ఒక్క సంధ్యా కాంతికి తప్ప.

కిటికీ దెక్కకి ఆనుకుని బయటికి చూస్తున్న సంధ్య గాఢంగా నిట్టూర్చింది.

"అమ్మాయి! సంజెచీకట్లు ముసురుకుంటున్నాయి దీపం పెట్టమ్మా" అన్న తల్లి పిలుపు సంధ్య చెవులకి తాకి విరాగిలాగ నవ్వుకుంది.

"సంజె చీకట్లు కాదు. ఈ సంధ్య జీవితంలోనే చీకట్లు ముసురుకున్నాయమ్మా" అనుకుంటూ బరువుగా కదిలింది. ఆ చీకటే చీకటి! మళ్ళీ వెలుగుని చూడలేదు సంధ్య! ఆమె జీవితమే చీకటి మయం అయిపోయింది.

* * *

☞ ఇరవయ్యవ శతాబ్దిలోని ఒక నవనాగరిక యువకుని తొందరపాటుకి ఒక్క రాత్రి జరిగిన దుర్ఘటనకి రెండు యువహృదయాలు అశాంతికి నిలయాలు అయ్యాయి. ఒక నిండుజీవితం బలిఅయి పోయింది. 'రామా కృష్ణా' అంటూ నిశ్చింతగా కాలం గడపవలసిన వయసులో, ఒక వృద్ధ దంపతులకు ప్రతీరోజూ తల్చుకు తల్చుకు దుఃఖించ వలసిన దుస్థితి ఏర్పడింది.

(అయిపోయింది)

# అందుకోండి హాయినిగూర్చే తాజాదనం




సింథాల్ టాయిలెట్ పౌడరు చికాకుపెట్టే శరీర దుర్గంధమునుండి రక్షణకూర్చి, ఎంతో వేడిగా ఉన్న రోజున కూడా మిమ్మల్ని తాజాగా ఉంచుతుంది. ఆహా! ఎంతో ఆహ్లాదాన్ని కలిగించే సువాసన... మీ తోనే నిలిచే సువాసన.

గోద్రెజ్ వారి
**సింథాల్**

Interpub/GSP/12/74 Tel

రచనలు, వ్యాసాలు, బొమ్మలు, ప్రశ్నలు మొదలైనవన్నీ పంపవలసిన చిరునామా:

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520003.




# షాలా కు ని డై రీ

స్టూడియో సుమారు యాభయి ఏడు లక్షలు అయ్యేట్టూ ఆయన చెప్పారట.

## కంచే చేనుమేస్తే !?

బెంగుళూరు మైసూరు రోడ్డు పోలీసు స్టేషనుకు చెందిన ఓ పోలీసు కానిస్టేబుల్ ఆగస్టు 28వ తేదీ ఉదయం ఆరు గంటలకు డ్యూటీ నుంచి ఇంటికి వచ్చి, ఏదో మరచిపోయిన వాడిలా మళ్లీ స్టేషనుకు వెళ్లి తా మ్మిది ప్రాంతంలో ఓ పటకా కత్తితో వచ్చాడట. వస్తూనే ధూందామ్మని ఎగిరి, తల్లిని ఓ మూలకు తోసేసి, బాత్ రూము తలుపు తోసుకు లోపలకు వెళ్లి, లోపల గడియవేసి, స్నానం చేస్తున్న తన భార్య సరోజను ఆ కత్తితో నరికి చంపేశాడట. ఆతని తల్లి అరుపులతో చుట్టుప్రక్కలవారు పోగైతే వారి అందర్నీ బెదరిస్తూ తాను సైకిలు చైనుతో పీకకు ఉరేసుకుని చనిపోతానని బెదరించాడట. చూపరులలో ధైర్యవంతులు తెగించి ఆతన్ని పట్టేశారట. అసలింతకూ ఆతనికి భార్య శీలం మీద అనుమానం వచ్చి, అది నమ్మకమై, దాంతో వచ్చిన ప్రతీకారంతో ఆమెను అంతంచేసి, మరో పెళ్లి చేసుకోవాలను కున్నాడట. పని సగం మాత్రమే అయి, పోలీసులకి చిక్కిపోయాడట.

## పెరిగిపోతున్న విదేశీ ప్రయాణాలు

1973—1974లో ఉద్యోగార్థులై మన దేశం నుంచి విదేశాలకు వెళ్లిన వారి సంఖ్య 6,924ట. ఈ 1974—75లో 20,504 మంది ఉద్యోగాలొచ్చాయంటూ మన దేశంలోంచి వెళ్లిపోయారట. అసలు 1974—75లో విదేశాలు ఏమో పనులు, తదితర వ్యవహారాల మీద వెళ్లిన వారి సంఖ్య (పి, ఫారం లెక్కలు) 76,608 అనీ, అందులో ఉద్యోగాల కోసం 20,504 మంది వెళ్లారనీ, చుట్టాలను చూడాలని 20,047 మంది వెళ్లారని, తమ కుటుంబంతో కలవడానికి 13,168 మంది వెళ్లారనీ రిజర్వు బ్యాంకు ఓ ప్రకటన చేసిందట. హబ్బ మనకి పై దేశాల్లో ఎవర్లేరా !! పైకాస్టేం ఇన్వైటజా !!

## తలకు రంగువల్ల కాన్సరా !?

తలలకు వేసుకునే రంగులు చాలా ప్రమాదాలకు దారితీస్తాయని ఆ రంగుల మూలంగానే కాన్సరు వంటి రోగాలు రావచ్చుననీ ఆస్ట్రేలియా మెల్బోర్న్‌లో వైద్య నిపుణులభిప్రాయపడుతున్నారట. తలకు నల్లరంగు వేసుకోడానికి కొనుక్కొనే స్త్రీలను వీరు ఎక్కువగా హెచ్చరించారట. ఈ రంగులలో కాన్సరును పుట్టించే లక్షణాలు వున్నాయని, ఆస్ట్రేలియాలో అమ్మబడే తలరంగుల్లో ఎనభై శాతంలోనైనా యీ "కేన్సరు" గుణాలు వున్నాయని అన్నారట. ఏవిటో ? ఏది వాడినా ముప్పేలావుంది,

## తేనెటీగల మారాం !

బొంబాయి నుంచి బరోడా వెళ్లాల్సిన విమానంలో ఓ యిరవై మంది ప్రయాణీకులు ముచ్చటగా ఎక్కికూర్చున్నారట. అయితే వారికన్నాముందు ఆ ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానం అంటేమోజు పడి ఓ పెద్ద తేనెటీగల పటాలం కూడా ఆ విమానంలోకి ఎక్కి కూర్చున్నాయట. వాటిని పారద్రోలే గొడవలో మూడు గంటలు ఆలస్యమయ్యిందట. ఈలోగా ఆ ప్రయాణికులను మరో విమానమెక్కించారట— అవును తేనెటీగలా! మజాకావా !! నో మజాకా.

## పెరిగిపోతున్న కాలుష్యం !

బొంబాయి వూళ్లో వాళ్లంతాచేరి ఓ సంవత్సర కాలంలో రెండువందల కోట్ల ఘనపు మీటర్ల మురికి నీటిని సముద్రంలో చేరుస్తున్నారట. అంటే 500 మీటర్ల పొడుగు, మరో 500 మీటర్ల వెడల్పు వుండేలా ఎవరెస్టు శిఖరమంత ఒంటిస్తంభపుమేడలాటిది కట్టిస్తే అది యీ మురికి నీటితో ఓ ఏడాదిలో నిండుతుందట. ఇదేగాక బొంబాయిలోని చిన్న పరిశ్రమలవారు ఏటికి ఏడుకోట్ల యాభై లక్షల ఘనపు మీటర్ల మురికి నీటిని సముద్రంలోకి వదులుతున్నారట.

## రోగలపై ఆయస్కాంత ప్రభావం

ఆవులకు ఆయస్కాంత ప్రయోగం చేస్తే అవి పాలు ఎక్కువ యిస్తాయని, అలా వచ్చిన పాలలో క్రొవ్వు భాగం అధికంగా ఉంటుందని సోవియెట్ శాస్త్రజ్ఞులు ప్రయోగమూలకంగా కనుగొన్నారట. నీటిని కూడా అయస్కాంత ప్రయోగం ద్వారాశుద్ధపరచి వాడితే మానవుల రోగాలలో చాలా భాగంతగ్గుతాయని కూడా అన్నారట.



సీరియల్

# జాబివేడు

పోతాప్రగడ రాజ్యలక్ష్మి

## 19

(గత సంచిక తరువాయి)

మాధవ్‌తోటి ఆ రోజున అలాగ తన సమస్యని పూర్తిగా చెప్పుకొన్న తర్వాత, హృదయం తేలిక అయినట్లూ, మనస్సులో ఉన్న ఆరాటం తగ్గినట్లూ అనిపించింది ఉషకి. . అయినా సమస్య అలాగే ఉండి పోయింది ఇంతకీ తను ప్రభాకరం కోసం వేచి ఉండేటట్లా, అతని మీదనుంచి మనస్సు పూర్తిగా మరల్చుకొనేటట్లా ? ఎటూ తేలలేదు... అది అటో ఇటో తేలిపోతే కొంచెం స్థిమితం చిక్కుతుంది... ఇప్పుడు ఎటయినా ఒకటే తనకి .. కాని ఆ ఎటో తేలాలి.

ఈ నెలాఖరులోనో వచ్చే నెల మొదట్లోనో మాధవ్ తిరిగి యూరోప్ వెళ్ళిపోతాడని తెలిసినప్పటి నుంచీ, ఈ సంగతేదో ముందు తేల్చుకోవాలనే ఆరాటం మరీ ఎక్కువైంది ఉషకి. అందుకే ఆలోచించి ఆలోచించి చివరకి ఓ రోజున ప్రభాకరానికి టెలిగ్రాం ఒకటి ఇచ్చింది "జీవితానికి సంబంధించిన ఒక ముఖ్యమైన విషయం చర్చించుకోవాలి మీరు వస్తారా, నన్ను రమ్మంటారా" అంటూ.

జవాబు కోసం ఒకటి రెండు రోజులు ఎదురు చూసింది ప్రభాకరం దగ్గర్నుంచి టెలిగ్రాం రాలేదు అయితే ఇంకో రెండు రోజులు పోయాక పెద్ద ఉత్తరం మాత్రం వచ్చింది, "జీవితమూ సమస్యలూ అంటూ పెద్ద పెద్ద అర్ధంలేని మాటల గురించి ఆలోచిస్తూ టైమ్ వేస్ట్ చేసుకోవద్దనీ, వచ్చేవి ఫైనలియర్ పరీక్షలు కనుక పిచ్చి పిచ్చి ఆలోచనలేం పెట్టుకోకుండా శ్రద్ధగా చదువుకోమనీ, వచ్చే ఏడు హౌస్ సర్జన్ కూడా అయ్యాక అన్నీ స్థిమితంగా ఆలోచించుకోవచ్చనీ ప్రస్తుతం తను వైజాగ్ రావడం పడదనీ అమ్మకి యాక్సిడెంటు అవడం, హాస్పటల్‌లో పని ఎక్కువగా ఉండడం, అమ్మ కోరికమీద వేణుమాధవస్వామి ఆలయంలో కళ్యాణ మంటపం కట్టించడం, నాన్నగారి పేర హైస్కూలు పెట్టించడం కోసం శంఖుస్థాపన చేయించడం, పక్క ఊళ్ళో పేషెంట్స్‌ని చూసి రావడం కోసం కారు కొనడం, దానాదీనా క్షణం తీరిక ఉండడంలేదనీ, ఈ సమయంలో జానీ సహాయం ఉంది కనక కానీ, లేకపోతే నానా అవస్థ పడేవాడననీ పైగా నెల్లాళ్ళ క్రితమే ఏదో పనిమీద విశాఖపట్నం వచ్చాననీ ఒక పూటల్లా ప్రయత్నం చేసినా తను కనిపించలేదనీ, ఎవరితోటో కలిసి అరకులోయ చూడ్డానికి వెళ్లావని చెప్పారనీ, పరీక్షలు దగ్గర్లో పెట్టుకుని అలా పిక్నిక్‌లూ అవీ వెళ్లడం మంచిది కాదనీ.. ఇంకా ఏవో ఏవో రాశాడు పిచ్చి పిచ్చిగా...

ఉషకి ఆ ఉత్తరం చూస్తే వళ్ళు మండుకొచ్చింది. టెలిగ్రాం ఇచ్చినా ఏం పట్టనట్లు ఉత్తరం రాసి ఎలా ఊరుకున్నాడో... తనకోసం మాధవ్ పడుతూన్న ఆరాటంలో, వెయ్యో వంతేనా ఈ ప్రభాకరానికి ఉందా ?... లోకం గొడవలన్నీ తనకి ఎందుకు ఆ ఉత్తరంలో.. పైగా జానీ ఉండడంవల్ల, బతికిపోయాడా !... మంచిదే... శాశ్వతంగా జానీతోటే ఉండమను.. ఎవరు కాదన్నారు ! ఆ ఉత్తరం యొక్క అర్ధం నువ్వు రావద్దనీ, నేను రాననీ — అంతేగా ? ఇంకా ఈ మనిషిని పట్టుకుని వేళ్ళాడడం తన బుద్ధితక్కువ. కోపంతో కాగితం కలం తీసుకుంది

డాక్టర్ ప్రభాకరంగారికి నమస్కారములు.

మీ సుదీర్ఘమైన జాబు అందింది. కృతజ్ఞతలు మీరంత హడావిడిగా వుంటే రావొద్దు నేనూ రానులెండి అత్తయ్యకి యాక్సిడెంట్ అయినట్లు ఆమధ్య ఎప్పుడో అన్నయ్య నాకు రాశాడుకాని మీరు తెలియపర్చలేదు. అవసరం లేదనుకున్నారేమో, పోనీండి కారు కొన్నారా ? బాగుంది. మీలాంటి ధనవంతులు కారు కొనడంలో ఆశ్చర్యం ఏముంది ? పోనీ, వేణుమాధవస్వామికైనా, కళ్యాణ వేదిక లభించింది . ఇంక మీకు మంచి సత్కాలక్షేపం నాలాంటి పేదపిల్లలకి చదువులు చెప్పించడం మీకు సరదాయేకదా ! హైస్కూలు కట్టించి యింకా చాలామందికి సహాయం చేస్తున్నారన్న మాట. సంతోషం ... డాక్టరుగారు మంచివారనే కీర్తి మీకు పుష్కలంగానే లభిస్తుంది ... ఫరవాలేదు ... మీకు అన్ని విషయాలలోనూ జానీ చేదోడు వాదోడుగా వుందని రాశారు ... అంతకంటే కావలసిందేముంది ... కానీండి ...

అన్నట్టు నా అరకులోయ పిక్నిక్ విషయం రాశారుకదూ ? ... అవునండీ ... మాధవ్ అని చాలా మంచి ఆత్మీయులైన మిత్రులు ... చాలా సరదాగా వుంటారు. నన్ను ప్రాణంలాగ చూసుకుంటున్నారు. వారితో కలిసి సరదాగా పిక్నిక్‌కి వెళ్ళాలనే వెళ్ళాను, పరీక్షలు దగ్గర్లో వున్నాసరే లెక్కచెయ్యకుండా...అత్తయ్యని మాత్రం ఓమారు చూడాలని వుంది...కాని మీరు రావద్దని రాశారుగా... రానులెండి. భయంలేదు...మీ ఋణం ఎలా తీర్చుకోవాలా అన్నది తప్ప నాకిప్పుడు వేరే సమస్య ఏం లేదు. ఉంటా 'ఉష'.

ఉత్తరం కవరులో పెట్టి పోస్టుచేసి వచ్చాక, 'హమ్మయ్య' అని ఏదో పెద్ద భారం తీరినట్లు ఒక్క సెకను అనిపించింది ఉషకి. కాని ఆ వుత్తరంతో ప్రభాకరానికీ తనకీ మధ్య వున్న అనుబంధం. . ? వెంటనే గుండెల్లోంచి వువ్వెత్తుగా లేచిన మంట ... సర్వస్వం పోగొట్టుకున్నట్లు మనస్సులో పెద్ద శూన్యం .. పక్కమీద బోర్లా పడుకుని ఎంతసేపో వెక్కి వెక్కి ఏడ్చింది.

బయట ఎవరో తలుపు తట్టిన చప్పుడైతే కన్నీళ్ళు తుడుచుకుని, వేళ్ళతో జుట్టు దువ్వుకుని వెళ్ళి, తలుపు తీసింది . ఎదురుగుండా నవ్వుతూ మాధవ్. అతణ్ణి చూడగానే ప్రాణం లేచివచ్చినట్లు అనిపించింది. చిరునవ్వుతో అతణ్ణి లోపలికి ఆహ్వానించింది. వచ్చి కుర్చీమీద కూర్చుంటూ "ఏవిటి మీరీ మధ్యన అయిదారురోజుల నుంచి అస్సలు కనిపించడమే మానేశారు ?" అన్నాడు మాధవ్.

"పరీక్షలు కదండీ !"

"తెగ చదివేస్తున్నారు కాబోలు ! కాస్త రిలీఫ్‌గా వుంటుంది అలా సినిమాకి పోదాం రాకూడదూ ?"

ఉషకి కూడా అలా ఎక్కడికేనా తిరిగివద్దామా అనే వుంది ... అందుకే వెంటనే "అలాగే ... వన్ మినిట్ ... బట్టలు మార్చుకొని..."

"మార్చుకోండి. నేనలా వరండాలో నుంచుంటాను."

అయిదు నిముషాల్లో సింపుల్‌గా ముస్తాబై

**జరిగిన కథ 12 :** భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్యగారి ఆస్తంతా దాన ధర్మాలతో హరించిపోయింది. భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తారు జోగమ్మగారు ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు. ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి. ఉషని మద్రాసులోని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల మురళితో కలసి విహార యాత్రలకి బయల్దేరుతుంది లీల పెళ్ళనే తంతు లేకుండానే దంపతు లౌతారు లీల మురళిలు మెడిసిన్ పూర్తయ్యాకే పెళ్లి అన్న ప్రభాకరం అంటే యేవగింపు కలుగుతుంది ఉషకి లీల మురళిలను చూడాలని వచ్చిన ఉష, ప్రభాకరాన్ని కలుస్తుంది ప్రమాదవశాత్తు మేడమీదనుంచి పడిన జోగమ్మగారి వెన్నెముక దెబ్బతింటుంది ప్రభాకరం సహాయాన్ని తిరస్కరిస్తుంది ఉష. తల్లి కాబోతున్న లీల, తండ్రిని చూడటానికి బయల్దేరుతుంది. ప్రొఫెసర్ గురుమూర్తిగారి బావమరది మాధవ్‌తో పరిచయ మవుతుంది ఉషకి




...యలుదేరింది ఉష "అరే .. నాకిష్టమైన ఈ వైట్ కేలీ సిల్క్ చీరే కట్టారే!" అన్నాడు మాధవ్ కళ్ళు ఎగరేస్తూ

"ఇది మీకిష్టమా? . అయితే మరీమంచిది. ఉండండి ..వార్డెన్‌కి చెప్పి వస్తా. లేకపోతే ఎక్కడికి వెళ్ళావని మళ్ళీ అదో ఆరా "

మాధవ్ నవ్వుకున్నాడు.

ఉష తిరిగివచ్చి 'పదండి' అంది.

"ఇవాళ మా బావగారికి ఏదో అర్జంటు పనుంది అని కారు వేసుకుని వెళ్ళిపోయారు . . అయినా అస్తమానూ కారు అడగడం నాకూ మొహమాటంగానే వుంది" అంటూ కారు లేనందుకు మాధవ్ సంజాయిషీ యిచ్చుకోబోయాడు.

"కారెందుకండీ ! సరదాగా కబుర్లు చెప్పుకుంటూ పోక .?" అంది ఉష. ఆ మాటతో మాధవ్‌కి మరింత వుత్సాహం వచ్చింది. "మన దేశంలో యిలా ఒక మగాడూ ఆడదీ కబుర్లు చెప్పుకుంటూ పోతూంటేనే వింతగా చూస్తారు ? ఫారిన్‌లో పక్క పక్క సీట్లలోనే కూర్చుంటారు ఒక్కొక్కప్పుడు చేతులూ చేతులూ పట్టుకుని నడుస్తారు .. ఎవళ్ళూ ఏం పట్టించుకోరు" అన్నాడు.

"నిజంగా ? "

"ఒట్టు" అంటూ చటుక్కున ఆమె చేతిలో చెయ్యివేశాడు.

"ఏమండోయ్ ! ఇది మీరు ఫారిన్ అనుకుంటున్నారేవిటి కొంపదీసి" అంటూ నవ్వింది. . మాధవ్ కూడా నవ్వాడు కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు కొంత దూరం నడిచాక ఉన్నట్టుండి ఆగి మాధవ్ "ఉషగారూ !" అన్నాడు

వెంటనే ఉష కొంటెగా "ఏవండి మాధవ్ గారూ !" అంది మళ్లీ ఇద్దరూ నవ్వుకున్నారు . అతని కళ్ళల్లోకి చూసి "ఏవిటి చెప్పబోతూ మానేశారు ?" అంది ఉష

"ఏవిటి చెప్మా !... ఆ... జ్ఞాపకం వచ్చింది... అనుకోని అదృష్టం కలిసివచ్చింది అనుకోండి. ప్రయత్నం చేసి స్వంతం చేసుకుంటే మంచిదా... లేక ప్రయత్నం చెయ్యకుండా వస్తే రానియ్యడం, లేకపోతే ఊరుకోవడం మంచిదా !"

"అదృష్టాన్ని, ప్రయత్నం చేసి స్వంతం చేసుకోవడంలోనే ఉంది ప్రజ్ఞ... వదులుకోవడం అంటే మన అసమర్థతని మనం ఒప్పుకున్నట్లే."

"నిజంగా ?"

"ఒట్టు అని ఇందాకా మీలాగ, చేతిలో చెయ్యి వేస్తాననుకున్నారా... అమ్మ !... అదేం కుదరదు" అంది ఉష కవ్విస్తూ.

"అది అత్యాశే అంటారా ?"

"ఏది ?. . దేని మాట మీరంటున్నది ?" అంది ఉష.

"ఏమండోయ్ ! మీరు బలేవారే .. చనువు ఇచ్చినట్టే ఇస్తారు. . మళ్లీ ఓ హద్దు గీసుకుని ఆ హద్దులోనే ఉండి, అది దాటి రానియ్యకుండా ఆపుచేస్తుంటారు. ."

"నేను ఎలా హద్దులు గీసుకుని ఉంటున్నానో ఇన్నాళ్ళూ గమనించినవాళ్ళే లేరు.. ఇంత కాలానికి గమనించేవారు మీరు దొరికారు. థేంక్స్.. "

మాధవ్ రెండు ఎ సి. లు కొన్నాడు. మాధవ్ పక్కనున్న సీట్లో కూర్చుంటూ "ఫారిన్‌లో ఎలా ఉందోకాని, ఇక్కడ మనుష్యుల మనస్తత్వం మరీ సంకుచితం అయిపోతోందండీ !. హద్దుల్లో ఉన్న వాళ్ళని అసమర్థులంటారు . కొంచెం ఫ్రీగా ఉన్నారో, గుణం మంచిది కాదంటారు ఈ అనడం, ఆక్షేపించడం ఆడవాళ్ళలో మరీ ఎక్కువ" అంది ఉష...

"కొంచెం ఎక్కువ తక్కువలు కాని మనుష్యుల మనస్తత్వం ఎక్కడేనా ఒకటే . అక్కడ మాత్రం ఆడవాళ్ళకి సాటి ఆడవాళ్ళమీద అసూయ లేదంటారా ? .."

ఇంతలో సినీమా మొదలెట్టడంవల్ల ఇద్దరూ సినిమా చూడ్డంలో నిమగ్నం అయి మాట్లాడుకోవడం తగ్గించారు.. సినీమాలో కథ అర్థంలేని అడ్డదారుల్లో పరిగెడుతోంది. ఎంతసేపటికీ హీరో, హీరోయినూ తోటలలో పరిగెట్టడం, చెట్లల్లో పరిగెట్టడం. ఇంక ఆ పరిగెట్టడానికి విసుగూ విరామం లేదు.

మాధవ్, ఉష చేతిమీద తడుతూ "ఏవిటండీ ఈ కథ ?" అన్నాడు. అతని స్పర్శ ఆమెలో కొత్త కోర్కెల్ని రేపింది ఉషకి, చెయ్యి వెనక్కి తీసుకోవా లనిపించలేదు. నవ్వుతూ "మరి తెలుగు సినిమా అంటే ఏమిటనుకున్నారు ?" అంది...

"ఏం సినిమాయో—విసుగొస్తోంది" అన్నాడు మాధవ్.

"ఏం, వెళ్లిపోదామా ?"

"మీరు చూద్దాం అంటే కూమందాం."

"వద్దులెండి పోదాం."

ఇద్దరూ హాలు బయటికి వచ్చారు.

"ఇంకా ఎనిమిది అయినా కాలేదు . కాస్సేపు అలా అప్సరకి వెళ్లి కాఫీ తాగుదాం. తల నెప్పిగా వుంది ." అన్నాడు మాధవ్. ఉష కాదనలేదు. ఆటోరిక్షాలో అతనిపక్క కూచోడానికికూడా కాదన

## "స్వగతం"

— యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

"నిండు కుండ తొణకదు .."
అది నానుడి — అదే సామెత —
అది ఎవరిదో అనుభవమూ కావచ్చు —
కానీ,
అగ్నిపర్వతం కూడ నిండు కుండలా కనబడుతుంది.
మూత తీయనంతవరకూ, కుండ నిండుదో
నిండుకుందో ఎలా తెలుసు ?
నిండుకుండ తొణక్కపోవచ్చు — కానీ
అగ్నిపర్వతమయితే బద్దలవక మానదు
ఇది సైన్సు —
నిండు కుండ తొణికితే నీళ్ళొలికిపోతాయ్
ఎవ్వరికీ బాధ లేదు — అనావృష్టి లేనంతవఋకూ,
నిప్పు కొండ పగిలితే.
ఆ అనుభూతి అనుభవైకవేద్యమే
ఎందుకంటే అది ఎలా వుంటుందో
నాకు తెలీదు కాబట్టి —
మనిషి మనిషినే నమ్ముతాడు, ఎందుకంటే
శ్వాస పీల్చే మరే జీవీ తన బాధ నర్థం చేసుకోలేదు
నోరున్న మనిషి తప్ప — కానీ
తను నమ్మిన మనిషికి మనసుందని
నమ్మకమేమిటి నోరుందని తప్ప —
మనిషనుకుంటాడూ, "మనిషన్న తరువాత
మనసుండక పోతుందా" అని...
కుక్క విశ్వాసం గల జంతువే
మరి పిచ్చిబడితే బువ్వ బెట్టిన చేతినే కరుస్తుందే —
నే ననేదేమిటంటే
మనిషయినా పసరమయినా
మనసంటూ వుండి మందగించనంతవఋకే మమకారం
మనిషి మనసు మారితే
కుక్కకు పిచ్చిబడితే
ఫలితంలో తేడా లేదు —
కొంచెం ముందూ, వెనకా అంతే!
కర్పూరానికి మంట తగిలితే వెలుగుతుంది
దేవుడికి హారతి పడతారు -
పెట్రోలయినా అంతే — మరి వెలిగించరేం కోవెల్లో
తప్పదు సత్యం చెప్పే అప్పన్న
వెలిగే కర్పూరాన్ని చేత్తో ఆర్పి నిజం చెప్పొనంటాడు
అప్పడనాలి దమ్మున్న వాణ్ణెవణ్ణయినా
పెట్రోలు వెలిగించి అర్పమని.
గుండెకు నోరుంటే, మనసుకు కళ్ళుంటే,
ఏవో చెప్పేవనీ మరేవో చూసేవనీ
ఈ రెండూ వున్న మనిషంటాడు —
వాడికి మెదడు లేదు ఎందుకంటే
నోరు లేనంతవఋకే అది గుండె
కళ్ళు లేనంతవఋకే అది మనసు —
ఇవేవీ లేనివాడే మనిషి —
నే ననుకునేవాణ్ణి
చిరునవ్వు నవ్వుతూ నను చూస్తున్న ప్రతి ఆడదీ
నన్ను వరిస్తోందని —
ఆవిడకు మెల్లకన్నునీ, చూసి నవ్వింది నా పక్కనున్న
అష్టావక్రుణ్ణనీ తెలిసినపుడు
వాడిమీద ఈర్ష్యా వామీద అపనమ్మకమూ కలగలా
"ఇంతకూ ఇంతసేపు నేను చూసింది
నన్ను చూస్తోందనుకుందీ
మెల్లకన్ను పిల్లా! ఛీ!" అనుకున్నా
నడవనంతవఋకూ నాకో కాలు అవుడన్న
సంగతి గుర్తేలేదు — ఏమిటో! **

---

లేదు హోటల్‌లో ప్రత్యేకంగా వున్న ఫేమిలీ రూమ్‌లోకి తీసికెళ్ళి కాఫీ అన్నవాడు, తీరా లోపలికి వెళ్ళాక రెండు స్వీట్స్‌కి ఆర్డరిచ్చాడు. స్వీట్ తింటూ "ఎలాగైనా కొందరితో కాలం తియ్యగా గడుస్తుంది" అంది ఉష

లైట్‌గా అంటోందా, అని ఆమెకేసి ఓమారు చూసి, మనస్ఫూర్తిగానే అంటోందని నిర్ధారణ చేసుకొని, "నిజంగానా ఉషా!" అన్నాడు మాధవ్ వుద్వేగంతో ఉషా అని అలా ఏకవచనంలో హృదయం పులకించేలా మాధవ్ పిలిచేసరికి, ఉష వుక్కిరి బిక్కిరి అయింది. కళ్ళల్లో మమతలు నింపుకొని అతన్నే చూస్తూ వుండిపోయింది

"ఏమిటలా చూస్తున్నారు ?" నవ్వుతూ అడిగాడు మాధవ్

"మీతో పరిచయం అయినప్పటినుంచీ నాలో యింతక్రితం లేని వుత్సాహం ఏదో ఉరకలాడు తోంది ఇంతవరకూ సమస్యల తోరణంగా, శ్రుతిలేని పాటలా సాగిన నా బ్రతుకు ఇప్పుడు "

"ఇప్పుడు ?" రెట్టిస్తూ అడిగాడు మాధవ్.

మిగిలిన వాక్యాన్ని బరువైన తన కనురెప్పల్ని వాల్చడం ద్వారా పూర్తిచేసింది ఉష

"ఉషా!" అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కాడు మాధవ్ ఎన్నాళ్ళ నుంచో తన శరీరం యిలాంటి ఆదరణకోసమే వేచివుందేమో, అతని స్పర్శకి కరిగిపోతోంది. మాధవ్ హృదయం అతని చేతిలోంచి తన చేతి ద్వారా వచ్చి తన గుండెని తట్టి లేపుతున్నట్లయింది మంత్రముగ్ధలా అలాగే కూర్చుండిపోయిన ఉష హృదయం యిప్పుడు పరవళ్ళుతొక్కుతూ ప్రవహిస్తున్న మహానదిలా వుంది దానిని ఇక గట్టులు ఆపలేవు ఆనకట్టే వెయ్యాలి

తన జీవితంలోకి ప్రభాకరంకంటే ఈ మాధవే ముందు ప్రవేశించి వుంటేనా ? . . ఆ కథ వేరుగా వుండేది మరిచిపోవాలనుకుంటున్న ప్రభాకరం పేరు జ్ఞాపకం వచ్చేసరికి, ఆమె హృదయం అంతా కృతజ్ఞతతో నిండిపోయింది ఆ రోజున ప్రభాకరం తన జీవితానికి సోపానపు పంక్తులు నిర్మించాడు కనకే, అవి అన్నీ ఎక్కివచ్చి ఈ ఎత్తులో మాధవ్ పరిచయం సంపాదించుకోగలిగింది తను ... లేకపోతే మాధవ్ ఎక్కడ ? తనెక్కడ ? ..

తన రెండో చేత్తో ఆమె బుజాన్ని నెమ్మదిగా కుదిపి "మధురమైన మౌనంతో ఎదుటివాడిలో మంటలు రేపకపోతే, తియ్యగా ఏదైనా మాట్లాడ కూడదూ ?" అన్నాడు మాధవ్. ఉష యిప్పుడు మాట్లాడే స్థితిలో లేదు పులకించే హృదయాన్ని, పూరడించే రసజ్ఞత కల మాధవ్ స్పర్శలో, కాలాన్ని మరిచి, తనని తానే మరిచి, కరిగిపోతోంది

సున్నితంగా అద్దాల మందిరంలా వుండే స్త్రీ హృదయాన్ని, తన లాలనతో పాలిస్తూ, అనురాగ దీపాలు వెలిగిస్తూ, పదిలంగా ప్రణయంతో అనుక్షణం రక్షిస్తూ, ఆనందకాంతుల్ని పండించే పురుషుడే లభించాలికాని లభిస్తే ఏ స్త్రీ తన సర్వస్వాన్నీ అతని కాళ్ళదగ్గర సమర్పించుకోదు ! ?

కోటి కోటి కోరికల జలపాతాలు మాధవ్ గుండెల్లో ఎగసిపడుతూంటే, తనని తాను సంబాళించుకోలేకపోతున్నాడు ఉష కూడా దాదాపు ఆ పరిస్థితిలోనే వుంది మిన్నంటుతూన్న ఆశలతో బేలగా మారిపోతూన్న ఆమె మనస్సు, మాధవ్ మనస్సుతో సమానంగా లయ వేస్తోంది.

ఉషని ఆప్యాయంగా తన చేతులతో చుట్టి, ఒళ్ళు తెలియని వ్యామోహంతో తనలోకి తీసుకోవాలని వుంది మాధవ్‌కి

అతను అలా చేస్తే తను ఆగగలదా? ... అతని కౌగిలిలో గువ్వలా ఒదిగిపోయి, తన సర్వస్వాన్నీ అంకితం చేసి, అతని గుండెలపై తల అన్చి స్వర్గాన్ని మరిచిపోదూ ?

ఒక చేత్తో మాధవ్ ఆమె బుజాన్ని నిమురుతున్నాడు.

అతని రెండో చేతిలో ఉష చెయ్యి, వెచ్చగా కోరికల పాన్పులా మెత్తగా కరిగిపోతోంది..

అలా ఇద్దరూ కాలాన్ని మరిచి, ఒకళ్ళకొకళ్ళు దగ్గరగా ఎంతసేపు ఉండిపోయారో.

హాఫ్ షట్టర్స్ తోసుకుని వెయిటర్ లోపలికి వస్తూన్న అలికిడి తగిలి, ఉలిక్కిపడి ఇద్దరూ దూర దూరంగా జరిగి కూర్చున్నారు.

కౌంటర్ దగ్గర బిల్లు చెల్లించి పోర్టికో దగ్గరికి నడవబోయినవాడల్లా ఆగి ఉషతో నెమ్మదిగా "అబ్బ... చాలా టైమైందే పదకొండు దాటింది... మీ వార్డెన్ ఏమీ అల్లరి చెయ్యదుకదా?"

ఉష ముఖంలో ఒక్క క్షణం తత్తరపాటు కనిపించింది... "పోనీ. . ఇవాళ్టికి ఒక రూమ్ తీసుకుని ఇద్దరం ఇక్కడే ఉండిపోతేనో.. "

హమ్మో. . ఉష గుండె గతుక్కుమంది... ఈ రాత్రి, మనస్సు తన వశం తప్పుతూన్న ఈ సమయంలో, ఇతనితో కలిసి ఒంటరిగా హోటల్లో ఉండడమా ? . నిజానికి మాధవ్ అంతటివాడు, కావాలని తనని కోరుకుంటే తనకి అంతకంటే కావలసింది ఏముంది?.. కాని . కాని.. చటుక్కున ఆమెకి ప్రభాకరం జ్ఞాపకం వచ్చాడు

ఇప్పుడీ మాధవ్ తనకోసం ఆరాటపడుతున్నట్లే, తనూ ప్రభాకరం పొందుకోసం తహతహలాడి ఒకటి రెండుసార్లు ఎంతో కోరికతో అతన్ని వశపరుచుకోవాలని ప్రయత్నించింది. కాని మనోనిబ్బరం కలవాడు కనక తనని మాటలతో మభ్యపెట్టి మెల్లగా తప్పించాడు వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకొనే ఆ ప్రభాకరానికీ, తెలివిగా అవకాశాన్ని కల్పించుకోవాలని చూసే ఈ మాధవ్‌కీ ఎంత తేడా !

3—10—75

## "స్వగతం"

— యస్. పి. బాలసుబ్రహ్మణ్యం

''నిండు కుండ తొణకదు...''
అది నానుడి — అదే సామెత —
అది ఎవరిదో అనుభవమూ కావచ్చు —
కానీ,
అగ్నిపర్వతం కూడ నిండు కుండలా కనబడుతుంది.
మూత తీయనంతవరకూ, కుండ నిండుదో
నిండుకుందో ఎలా తెలుసు ?
నిండుకుండ తొణక్కపోవచ్చు — కానీ
అగ్నిపర్వతమయితే బద్దలవక మానదు
ఇది సైన్సు —
నిండు కుండ తొణికితే నీళ్లొలికిపోతాయ్
ఎవ్వరికీ బాధ లేదు — అనావృష్టి లేనంతవఱకూ,
నిప్పు కొండ పగిలితే..
ఆ అనుభూతీ అనుభవైకవేద్యమే
ఎందుకంటే అది ఎలా వుంటుందో
నాకు తెలీదు కాబట్టి —
మనిషి మనిషినే నమ్ముతాడు, ఎందుకంటే
శ్వాస పీల్చే మరే జీవీ తన బాధ నర్థం చేసుకోలేదు
నోరున్న మనిషి తప్ప — కానీ
తను నమ్మిన మనిషికి మనసుందని
నమ్మకమేమిటి నోరుందని తప్ప —
మనిషనుకుంటాడూ, ''మనిషన్న తరువాత
మనసుండక పోతుందా'' అని...
కుక్క విశ్వాసం గల జంతువే
మరి పిచ్చిబడితే బువ్వ బెట్టిన చేతినే కరుస్తుందే —
నే ననేదేమిటంటే
మనిషయినా పసరమయినా
మనసంటూ వుండి మందగించనంతవఱకే మమకారం
మనిషి మనసు మారితే
కుక్కకు పిచ్చిబడితే
ఫలితంలో తేడా లేదు —
కొంచెం ముందూ, వెనకా అంతే!
కర్పూరానికి మంట తగిలితే వెలుగుతుంది
దేవుడికి హారతి పడతారు —
పెట్రోలయినా అంతే — మరి వెలిగించరేం కోవెల్లో
తప్పుడు సాక్ష్యం చెప్పే అప్పన్న
వెలిగే కర్పూరాన్ని చేత్తో ఆర్పి నిజం చెప్పేనంటాడు
అప్పడనాలి దమ్మున్న వాణ్ణేవణ్ణయినా
పెట్రోలు వెలిగించి ఆర్పమని.
గుండెకు నోరుంటే, మనసుకు కళ్లుంటే,
ఎవో చెప్పేవనీ మరేవో చూసేవనీ
ఈ రెండూ వున్న మనిషంటాడు —
వాడికి మెదడు లేదు ఎందుకంటే
నోరు లేనంతవఱకే అది గుండె
కళ్ళు లేనంతవఱకే అది మనసు —
ఇవేవీ లేనివాడే మనిషి —
నే ననుకునేవాణ్ణి
చిరునవ్వు నవ్వుతూ నను చూస్తున్న ప్రతి ఆడదీ
నన్ను వరిస్తోందని —
ఆవిడకు మెల్లకన్నునీ, చూసి నవ్వింది నా పక్కనున్న
అష్టావక్రుణ్ణనీ తెలిసినపుడు
వాడిమీద ఈర్ష్య నామీద అపనమ్మకమూ కలగలా
''ఇంతకూ ఇంతసేపు నేను చూసిందీ
నన్ను చూస్తోందనుకుందీ
మెల్లకన్ను పిల్లా! ఛీ!'' అనుకున్నా
నడవనంతవఱకూ నాకో కాలు అవుడన్న
సంగతి గుర్తేలేదు — ఏమిటో!
**

లేదు. హోటల్‌లో ప్రత్యేకంగా వున్న ఫేమిలీ రూమ్‌లోకి తీసికెళ్ళి కాఫీ అన్నవాడు, తీరా లోపలికి వెళ్ళాక రెండు స్వీట్స్‌కి ఆర్డరిచ్చాడు. స్వీట్ తింటూ ''ఎలాగైనా కొందరితో కాలం తియ్యగా గడుస్తుంది'' అంది ఉష.

లైట్‌గా అంటోందా, అని ఆమెకేసి ఓమారు చూసి, మనస్ఫూర్తిగానే అంటోందని నిర్ధారణ చేసుకొని, ''నిజంగానా ఉషా!'' అన్నాడు మాధవ్ వుద్వేగంతో. ఉషా అని అలా ఏకవచనంలో హృదయం పులకించేలా మాధవ్ పిలిచేసరికి, ఉష వుక్కిరి బిక్కిరి అయింది. కళ్లల్లో మమతలు నింపుకొని అతన్నే చూస్తూ వుండిపోయింది.

''ఏమిటలా చూస్తున్నారు ?'' నవ్వుతూ అడిగాడు మాధవ్.

''మీతో పరిచయం అయినప్పటినుంచీ నాలో యింతక్రితం లేని వుత్సాహం ఏదో ఊగిసలాడుతోంది. ఇంతవరకూ సమస్యల తోరణంగా, శ్రుతిలేని పాటలా సాగిన నా బ్రతుకు ఇప్పుడు...''

''ఇప్పుడు...?'' రెట్టిస్తూ అడిగాడు మాధవ్.

మిగిలిన వాక్యాన్ని బరువైన తన కనురెప్పల్ని వాల్చడం ద్వారా పూర్తిచేసింది ఉష.

''ఉషా!'' అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కాడు మాధవ్. ఎన్నాళ్ళనుంచో తన శరీరం యిలాంటి ఆదరణకోసమే వేచివుందేమో, అతని స్పర్శకి కరిగిపోతోంది. మాధవ్ హృదయం అతని చేతిలోంచి తన చేతి ద్వారా వచ్చి తన గుండెని తట్టి లేపుతున్నట్లయింది. మంత్రముగ్ధలా అలాగే కూర్చుండిపోయిన ఉష హృదయం యిప్పుడు పరవళ్ళుతొక్కుతూ ప్రవహిస్తున్న మహానదిలా వుంది. దానిని ఇక గట్టులు ఆపలేవు ... ఆనకట్టే వెయ్యాలి.

తన జీవితంలోకి ప్రభాకరంకంటే ఈ మాధవే ముందు ప్రవేశించి వుంటేనా ? ... ఆ కథ వేరుగా వుండేది. మరిచిపోవాలనుకుంటున్న ప్రభాకరం పేరు జ్ఞాపకం వచ్చేసరికి, ఆమె హృదయం అంతా కృతజ్ఞతతో నిండిపోయింది. ఆ రోజున ప్రభాకరం తన జీవితానికి సోపానపు పంక్తులు నిర్మించాడు కనకే, అవి అన్నీ ఎక్కివచ్చి ఈ ఎత్తులో మాధవ్ పరిచయం సంపాదించుకోగలిగింది తను ... లేకపోతే మాధవ్ ఎక్కడ ? తనెక్కడ ? ...

తన రెండో చేత్తో ఆమె బుజాన్ని నెమ్మదిగా కుదిపి ''మధురమైన మౌనంతో ఎదుటివాడిలో మంటలు రేపకపోతే, తియ్యగా ఏదైనా మాట్లాడకూడదూ ?'' అన్నాడు మాధవ్. ఉష యిప్పుడు మాట్లాడే స్థితిలో లేదు. పులకించే హృదయాన్ని, పూరడించే రసజ్ఞత కల మాధవ్ స్పర్శలో, కాలాన్ని మరిచి, తనని తానే మరిచి, కరిగిపోతోంది.

సున్నితంగా అద్దాల మందిరంలా వుండే స్త్రీ హృదయాన్ని, తన లాలనతో పాలిస్తూ, అనురాగ దీపాలు వెలిగిస్తూ, పదిలంగా ప్రణయంతో అనుక్షణం రక్షిస్తూ, ఆనందకాంతుల్ని పండించే పురుషుడే లభించాలికాని లభిస్తే ఏ స్త్రీ తన సర్వస్వాన్నీ అతని కాళ్ళదగ్గర సమర్పించుకోదు ! ?

కోటి కోటి కోరికల జలపాతాలు మాధవ్ గుండెల్లో ఎగసిపడుతూంటే, తనని తాను సంబాళించుకోలేకపోతున్నాడు. ఉష కూడా దాదాపు ఆ పరిస్థితిలోనే వుంది. మిన్నంటుతూన్న ఆశలతో బేలగా మారిపోతూన్న ఆమె మనస్సు, మాధవ్ మనస్సుతో సమానంగా లయ వేస్తోంది.

ఉషని ఆప్యాయంగా తన చేతులతో చుట్టి, ఒళ్ళు తెలియని వ్యామోహంతో తనలోకి తీసుకోవాలని వుంది మాధవ్‌కి.

అతను అలా చేస్తే తను ఆగగలదా? ... అతని కౌగిలిలో గువ్వలా ఒదిగిపోయి, తన సర్వస్వాన్నీ అంకితం చేసి, అతని గుండెలపై తల ఆన్చి స్వర్గాన్ని మరిచిపోదూ ?

ఒక చేత్తో మాధవ్ ఆమె బుజాన్ని నిమురుతున్నాడు.

అతని రెండో చేతిలో ఉష చెయ్యి, వెచ్చగా కోరికల పాన్పులా మత్తుగా కరిగిపోతోంది...

అలా ఇద్దరూ కాలాన్ని మరిచి, ఒకళ్ళకొకళ్ళు దగ్గరగా ఎంతసేపు ఉండిపోయారో...

హాఫ్ షట్టర్స్ తోసుకుని వెయిటర్ లోపలికి వస్తున్న అలికిడి తగిలి, ఉలిక్కిపడి ఇద్దరూ దూర దూరంగా జరిగి కూర్చున్నారు...

కౌంటర్ దగ్గర బిల్లు చెల్లించి పోర్టికో దగ్గరికి నడవబోయినవాడల్లా ఆగి ఉషతో నెమ్మదిగా ''అబ్బో... చాలా టైమైందే... పదకొండు దాటింది... మీ వార్డెన్ ఏమీ అల్లరి చెయ్యదుకదా?''

ఉష ముఖంలో ఒక్క క్షణం తత్తరపాటు కనిపించింది... ''పోనీ... ఇవాళ్టికి ఒక రూమ్ తీసుకుని ఇద్దరం ఇక్కడే ఉండిపోతేనో...''

హమ్మో... ఉష గుండె గతుక్కుమంది... ఈ రాత్రి, మనస్సు తన వశం తప్పుతూన్న ఈ సమయంలో, ఇతనితో కలిసి ఒంటరిగా హోటల్లో ఉండడమా ?... నిజానికి మాధవ్ అంతటివాడు, కావాలని తనని కోరుకుంటే తనకి అంతకంటే కావలసింది ఏముంది?... కాని...కాని.. చటుక్కున ఆమెకి ప్రభాకరం జ్ఞాపకం వచ్చాడు.

ఇప్పుడీ మాధవ్ తనకోసం ఆరాటపడుతున్నట్లే, తనూ ప్రభాకరం పొందుకోసం తహతహలాడి ఒకటి రెండుసార్లు ఎంతో కోరికతో అతన్ని వశపరుచుకోవాలని ప్రయత్నించింది. కాని మనోనిబ్బరం కలవాడు కనక తనని మాటలతో మభ్యపెట్టి మెల్లగా తప్పించాడు. వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకొనే ఆ ప్రభాకరానికీ, తెలివిగా అవకాశాన్ని కల్పించుకోవాలని చూసే ఈ మాధవ్‌కీ ఎంత తేడా !

— కె. రామలక్ష్మి

ఒ. ఎల్. ఎన్. చిటివాడ

మీ ప్రశ్నావళి ఆడ–మగ అందరూ సమానంగా ఆసక్తిగా చూస్తూంటారు. కాని సమాధానాల్లో మీరు ఎక్కువగా ఆడవారిని వెనకేసుకొస్తూంటారు. ఏ భేదాభిప్రాయం పెట్టుకోని మగవారికి బాధా కరంగా వుంటుందని మీ రెందుకు గుర్తించరు?

★ నిజంగా ఏ బేధాభిప్రాయం లేనివాళ్లకి నేను వెనకేసుకొచ్చే కేసులు అర్థం కావంటారా?!

ఎస్. సి. హెచ్. ఆర్. — సీతాపురం.

పురుషులకంటే స్త్రీలకు గమనశక్తి తక్కువ అంటారు?

★ ఆది అందుకే మందగమన అన్నారు! అందంగా హుందాగా నడుస్తూనే — గజగమనంలా తెలియకుండా గమ్యంచేరకల నేర్పు ఆడదానిది.

ప్రకాష్ — కాకినాడ.

ఆరాధన అనే పవిత్రపదాన్ని కామదృష్టితో చూచి అగౌరవ పరిచారు. దీనికి మీ సంజాయిషీ ఏమిటి?

★ ఆరాధనలో ప్రేమలేదా? ప్రేమలో కామం లేదా? కామం మానవ సహజగుణం కాదా? సహజగుణాన్ని కాదని, నిలబడగల మానవు డున్నాడా? ఉంటే అతన్ని మానవుడంటామా?

సి. హెచ్. ఆర్. బి. మిర్యాలగూడెం.

తెలుగు మహాసభలు విజయవంతం అయాయి అంటారా? రామలక్ష్మిగారూ?

ఎవరికో చెప్పకుండా ఎలా చెప్పడం రావుగారూ!

ఆర్. ఎస్. కె. — నందిగామ.

నాకు మీచేతి భోజనం చేయాలని వుంది.

వద్దు నాన్నా, ఏ విషయమైనా అలవాటుమీద ఫరవాలేదుగాని హఠాత్తుగా తింటే వికటిస్తుంది!

పి. ఆర్. ఎస్. కొత్తగూడెం.

రంగనాయకమ్మ, కొడవటిగంటి వంటి ఉత్తమ రచయితలను విమర్శించేముందు మీ తాహతు తెలుసుకుని విమర్శించడం మంచిది.

★ గడ్డిపోచ కూడా ఏనుగకాలికిందపడినా అది పాదం తీయగానే—తలెత్తి వెక్కిరించకలదు. దానికి తనస్తోమతు తెలియదంటారా? తెలుసు. ఎంత అల్పజీవికైనా—తన అభిప్రాయ ప్రకటన చేసే గుణం వుంటుంది. అది కమ్యూనిస్టురాజ్యాల్లో అణచేస్తారు. ప్రజాస్వామ్యరాజ్యాల్లో — చెప్పనిస్తారు!

వి. జి. ఆర్. — సికింద్రాబాదు.

ప్రపంచంలో మంచివస్తే ఖరీదెక్కువ.

★ పొరపాటు. మంచివే తక్కువ వెల. గాలి, నీరు, నీడ, నింగి, నేల వీటి విలువ ఎలా కడతారు? చెడ్డవే ఖరీదెక్కువ.

---

వేడి

రాగం తీసుకుంటూ, ఉష ఇటు వచ్చింది గురుమూర్తి ఇంటికి.

"నమస్కారం సార్" అంది గురుమూర్తిని చూస్తూనే. ఆయన పేపరు తప్పించి ఉషని ఓమారు చూసి ఊరుకున్నాడే కాని, ఎప్పుడూ అనేలాగ "రా అమ్మా ఉషా" అంటూ ఆప్యాయంగా పలకరించలేదు... "వచ్చావా ఉషా" అంటూ మామూలుగా ఎదురు వచ్చి కౌగలించుకున్నంత పని చేసి లోపలికి తీసుకువెళ్లే రాధ కూడా ఆ రోజెందుకో ముభావంగా ఉంది. పైగా "అమ్మా!... మీ ఊరమ్మాయి వచ్చింది" అంటూ వెటకారంగా లోపలికి కేకేసింది... రాధ ప్రవర్తన చూసి విస్తుపోయింది ఉష... సీతమ్మ ధుమ ధుమ లాడుతూ కనిపించేసరికి ఉష పూర్తిగా దిగ్భ్రాంతురాలైంది. వంటింట్లోకి చనువుగా వస్తూన్న ఉషకి ఎదురుగా వచ్చి "ఏం ఇలా వచ్చావు? హాల్లో కూర్చో... అక్కడికి వచ్చి మాట్లాడతాను" అంది సీతమ్మ కఠినంగా...

ఉషకి తల కొట్టేసినట్లయింది. ముగ్గురికి ముగ్గురూ ఎంతో ఆప్యాయంగా ఉండేవాళ్ళు, ఇవాళ తనని ఎందుకు ఏదో దొంగిలించినదానిలా చూస్తూ అవమానపరుస్తున్నారు?... ఏమొచ్చింది?... తనని రమ్మని చెప్పిన మాధవ్ ఏడీ?... హాల్లో కూర్చుని మాధవ్ కోసం గదులన్నీ కలయజూస్తూ, 'ఎందుకొచ్చిన కూర్చోడం? పోనీ వెళ్లిపోదామా?' అనుకుంది ఉష. అలా పది పదిహేను నిముషాలు ఇబ్బందిగా వేచి ఉన్న తర్వాత, తడి చేతులు తుడుచుకుంటూ హాల్లోకి వచ్చింది సీతమ్మ. వస్తూనే "తెలిసిన పిల్లవికదా మర్యాదస్తురాల వనుకొని ఇంట్లోకి చనువుగా రానిచ్చినందుకు, మామంచి పాఠమే నేర్పావమ్మా తల్లీ!" అంటూ పిడుగులు వర్షించినట్లు మాట్లాడింది సీతమ్మ.

ఉషకి తలా తోకా ఏం అర్థం కాలేదు.

"మీరంటున్నది ఏమిటో..."

"విడమరిచి చెప్పాలా?" సీతమ్మ కంఠం ఖంగ్‌మంది.

ఏమిటి ఈవిడిలా మాట్లాడుతుంది? మర్యాద కోసం ఊరుకుంటోందికాని అలా తనూ మాట్లాడ లేదూ? ... అసలా మాటకి వస్తే, అందరితోనూ రుణ ఝణాగా మాట్లాడేసి ఎవర్నీ లెక్కచెయ్యకుండా తిరగగలదు తను. కాని రాధలా మంచి పొజిషన్‌లో వున్న తండ్రీ, ఆదరించే తల్లీ లేదు తనకి. తనొక అనాథ. తనలో ఎంత శక్తి వున్నా, మనస్సులో ఎంత ఆవేశం వున్నా, అదంతా అణుచుకొని వినయంగా సౌమ్యంగా వుండవలసిన పరిస్థితి తనది. మనస్సులోనూ, జీవితంలోనూ తల్లీ తండ్రీ లేని ఈ వెలితే కనక లేకపోతేనా...?

ఉషకి కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి.

అది చూసి సీతమ్మ "ఎందుకు దొంగఏడుపు ఏడుస్తావు, చేసింది చేసి?"

దాంతో యింక ఉష సహనం హద్దులు దాటింది.

"ఏవండోయ్ సీతమ్మగారూ! మీ అర్థంలేని పుల్లవిరుపు మాటలకి కంగారుపడి కళ్ళమ్మట నీళ్ళు తెచ్చుకోలేదండీ! అవి వేరే కారణంవల్ల వచ్చాయి. అది సరే యిందాకటినుంచి చూస్తున్నాను...వ్యంగ్యంగానూ, నిష్ఠూరంగానూ మాట్లాడుతున్నారు. డొంకతిరుగుడుగా చెప్పకపోతే తిన్నగా చెప్పకూడదూ ఆ చెప్పేదేమిటో!"

బిగ్గరగా అరిచిన ఉష కంఠం విని గురుమూర్తీ, రాధా, యిద్దరూ చెరోవేపు నుంచీ హాల్లోకి వచ్చారు.

"మేం ఏమీ చెప్పనూ అక్కర్లేదు మా మొర నువ్వేమీ ఆలకించనూ అక్కర్లేదు. ఇన్నాళ్ళూ మేం గీసిన గీటు దాటకుండా వుంటూ వచ్చిన బంగారం లాంటి కుర్రాడిని నీ వల్లో వేసుకున్నావుగా తల్లీ! యింక వెళ్ళు" అంది సీతమ్మ.

ఉష నిశ్చేష్టురాలై వుండిపోయి, "వెళతాను లెండి ... లేకపోతే మీరు చూపిస్తున్న మర్యాదకి యింకా వుంటాననుకున్నారా? కాని వెళ్ళబోయే ముందు ఒక్క సంగతి ... మీరేదో చాలా పొరబాటు పడ్డారు. నేను ఎవర్నీ వల్లో వేసుకోలేదు. దయవుంచి ఆ మాట మర్యాదగా వెనక్కి తీసుకోండి" అంది గంభీరంగా.

సీరియస్‌గా మారిన ఉష ముఖం చూసి, ఆ పరిస్థితిని ఎదుర్కోవడం తన భార్య వల్లకాదని గ్రహించి, తను రంగంలోకి వచ్చాడు గురుమూర్తి. వచ్చి "సరే — మాటలు వెనక్కి తీసుకోవడం, తీసుకోకపోవడం అలా వుంచు. నేను ఒకటి రెండు విషయాలు అడుగుతాను చెప్పు" అన్నారు.

ఉష జంకకుండా "అడగండి" అంది.

"మొన్న రాత్రి పదకొండు అయేదాకా నువ్వూ మాధవ్ అప్సర హోటల్లో వున్నారా?"

"ఉన్నాం ... వుంటే?"

"ఇద్దరూ పెళ్లికానివాళ్లేకదా?"

"ఇవాళ కాలేదు — కాని రేపు కావచ్చు."

"ఇద్దరూ పెళ్లి చేసుకుందాం అని నిర్ణయించుకున్నారా?"

ఉష సమాధానం చెప్పలేదు.

"ఈ పెళ్లికి ప్రోత్సాహం వాడిదా నీదా?"

"ఆ ప్రశ్న ఆయన్ని అడగండి."

"పోనీ మాధవ్ మా రాధకి కాబోయే మొగుడ అనేనా నీకు తెలుసా?"

ఉష నిర్ఘాంతపోయి, ఒక్కసారి "ఆఁ!" అని అరిచింది. వెంటనే స్థిమితపడి "ఆ సంగ నాకు తెలియదు." అంది.

"ఆఁ! తెలియకేం?" అంది సీతమ్మ.

"ఉండు, నువ్వు మాట్లాడకు. ఇవా మాధవ్ యింతవాడయ్యాడుకాని...చిన్నప్పటినుం వాడిని పెంచి పెద్దచేసి పై చదువులు చెప్పించా అంటావా? అలా చెప్పించినందుకు మాకే ఆశలుంటాయా? యింత శ్రమపడి మేం పెం వాణ్ణి చేస్తే, ఎక్కడినుంచో వచ్చి వాడిని నువ ఎత్తుకుపోవడంకోసమా? అహ, చెప్పు."

ఉషకి ఒక్కమారు కళ్ళు తిరిగినట్లయిం మాధవ్ కూడా సరిగ్గా తన స్థితిలోనే వున్నాడ అతనికీ ఈ కృతజ్ఞత సమస్యే రావాలి? తనని ప్ర కరం ఇంతదాన్ని చేస్తే మాధవ్ వచ్చి ఈ ఫల కాస్త అందుకుంటున్నాడు. తనూ అంతేనా? పీ ఆశలు పెంచుకొన్న మాధవ్‌ని తను స్వంతం చేసు బోతోంది... ఇది ఎంతవరకూ న్యాయం? అలా ఇంతవరకూ వచ్చిన తమ ఇద్దరి పరిచయం ఏ పోవాలి!...

ఉష కళ్ళు రెండూ నీళ్ళతో నిండా "మేష్టారూ నిజం చెప్తున్నాను... మీ రా

(30 వ పేజీ చూడండి)

# సి ని మా

(2 వ పేజీ తరువాయి)

## కథనుబట్టి నటీనటులు

"సంతానం, సంకల్పం" చిత్రాలను జనరంజకంగా రూపొందించిన రంగనాథ్‌దాసుగారు చాలా కాలం తర్వాత, దర్శకత్వం చేపట్టారన్న వార్త పాఠకులకు తెలిసేను

ఈమధ్య రంగనాథదాసుగారిని, గజానన పిక్చర్స్‌లో కలిశాను అప్పుడాయనతోబాటు, రచయిత అప్పలాచార్య, నిర్మాత పుష్పరాజ్ కూడా వున్నారు ముగ్గురూ కథపై తీవ్రంగా చర్చ జరుపుతూ వున్నారు

కథనుబట్టి నటీనటుల ఎన్నిక వుండాలేగాని, నటీనటులకోసం కథను రాయడం మంచి పద్ధతి కాదన్న దాసుగారి మాట నూరు శాతం నిజం అనిపించింది

రచయితకు 'ఫ్రీడమ్' యిచ్చినప్పుడె, అతడు మనస్ఫూర్తిగా మాటలు రాయగలడు అన్న ఆయన వాదంలో న్యాయం వున్నది

కథ నిర్ణయం అయిన తర్వాత, కథా పాత్రను పాపులర్ స్టార్ పేర్ నటించవలసివస్తే, వాళ్ళకోసం కొంత యాడ్ చెయ్యడంలో తప్పు లేదంటారు, రంగనాథదాసు

## గజానన పిక్చర్స్ !

ఈ సంస్థను నెల్లూరు పుష్పరాజ్ స్థాపించారు విద్యాధికుడు సంస్కారం వున్న మంచి మనిషి మంచి కథకుడు

తన కృతజ్ఞతలు ఇద్దరికి చెప్పుకొంటున్నాడు ఒకరు ఆర్ ఎస్ రాజు మరొకరు వాణిశ్రీ యిద్దరి సహకారంవల్లే గజానన పిక్చర్స్ అతి త్వరలో చిత్రం తీయగలుగుతుంది", అన్నారు రాజ్

ఆంధ్రుల అగ్రనటి ధరించే భూమిక ప్రతి ప్రేక్షకుడిచేత ఆకర్షింపబడేదిగా వున్నది మాస్ స్టైల్ వున్న పాత్ర కళాభినేత్రిది ప్రధాన పాత్రలను రామకృష్ణ, సత్యనారాయణ, రాజబాబు పోషిస్తున్నారు

నవంబరు నుంచి షూటింగు ఆరంభం ఆంధ్రదేశంలోని ముఖ్య కేంద్రాలలో షూటింగు పెట్టుకొన్నారు, దర్శకుడు రంగనాథదాస్

ప్రతిరోజూ ఆఫీసులో సంగీత దర్శకుడు రాఘవులు, పాటల రచయితలు కొసరాజు, అనిసెట్టి, డాక్టర్ కవిగార్లు మాణిక్యాల్లాంటి పాటలకోసం కృషి చేస్తున్నారు

## పూర్ణమ్మ కథ

శివాజీ ఆర్ట్సు నిర్మిస్తున్న "పూర్ణమ్మ కథ" చిత్రాన్ని, కథకుడు, దర్శకుడు అయిన నందనరావు చూపించారు

గురజాడవారి "పుత్తడి బొమ్మ" కథ కాదు యీ "పూర్ణమ్మ కథ" అనేది నిజాన్ని పాఠకులకు తెలుపుతున్నాను

"అల్లరి చేసే పల్లె పిల్ల, విధి రాత ప్రకారం ఒక వెర్రిబాగువాడికి అర్ధాంగి గావడం, అన్నయ్య లాంటి మనిషితో తనకు అక్రమ సంబంధం వుందని తప్పుడు ప్రచారం చేసిన సమాజాన్ని ఎదిరించి, తన పవిత్రతను, నిరూపించడం" యీ "పూర్ణమ్మ కథ" చిత్ర సారాంశం

పూర్ణమ్మగా రోజారమణి సంపూర్ణత్వం అబ్బిన నటివలె ప్రకాశించింది "అల్లరితనం, అమాయకత్వం, హుందాతనం" గొన్న పూర్ణమ్మ పాత్రకు రోజారమణి పరిపూర్ణత తెచ్చింది

అపవాదుకు గురి అయిన పాలేరు పాత్రలో రామకృష్ణ చక్కగా రాణించారు "వెర్రితలవాడు"గా నాగేష్ చిత్రానికి ప్రాణం పోశారు

కన్నకూతురి శీలాన్ని కూడా శంకించిన తండ్రిగా ప్రభాకరరెడ్డి నటన, కోడలి శీలాన్ని గౌరవించిన మామగా ధూళిపాళ పోటీపడి నటించారు కుంటి రామలింగయ్యగా "అల్లు" బలేగానటించారు

"పూర్ణమ్మ కథ" చిత్రంలో నన్ను ఆకర్షించిన నటుడు మాడా మాడా నటించిన తీరు, దుర్వాసుడిని కూడా నవ్విస్తుంది మాడాలో యింత నటన దాగివుందా అనిపించింది

దర్శకత్వం గూర్చి రాయాలంటె నందనరావులోని ప్రతిభను, ప్రజ్ఞను పరిశ్రమ ఎందుకు వుపయోగించుకోవడంలేదు అనేడి ప్రశ్న వుదయించింది నిర్మాత నాగేశ్వరరావు అదృష్టవంతుడు

"పూర్ణమ్మ కథ" చిత్రం ప్రజలకు నచ్చే అంశాలను గొనియున్నది ఎక్కడా అసభ్యతగాని, అనవసరమైన సంఘటనగాని లేనిదిగా వున్నది

## అభిమాన సంస్థల్లో అభిమాన జంట

ప్రేక్షకులు అభిమానించే సత్య చిత్ర, అనిల్ ప్రొడక్షన్స్‌వారి చిత్రాలలో ప్రజలభిమానించే శోభన్, వాణిశ్రీ జంటగా నటిస్తున్నారు

ప్రేక్షకులు కోరే జంటను పెట్టడానికి నిర్మాతలు సుముఖంగా వున్నారు ఇద్దరికీ సమాన ప్రాతినిధ్యం వున్నప్పుడె, నిర్మాతలకు, నటించేవారికి, చూచేవారికి తృప్తి, ఆనందం ఏర్పడుతుంది

సత్య చిత్ర, అనిల్ ప్రొడక్షన్స్ తలపెట్టిన చిత్రాలలో యిద్దరికీ జనామోదం పొందే పాత్రలు లభించాయి

శోభన్‌బాబు, వాణిశ్రీల మధ్య ఎలాంటి గొడవలు లేవు అనడానికి పై చిత్రాలే నిదర్శనాలు



"తోటరాముడు"లో మంజుల, చలం



'చిట్టెమ్మ–చిలకమ్మ'లో
కల్పనారాయ్, కె వి చలం, జూ భానుమతి



"ఆస్తికోసం"లో ప్రమీల, రామకృష్ణ

## చిరంజీవి అక్కినేని !!

జులై 15 న, తెలుగు తెరకు కొత్త హీరో లభించాడు అని పాఠకులకు తెలిపాను ఆయన లక్షలాది ప్రేక్షకులకు పరిచితుడే

ఆంధ్రుల అభిమాన కథానాయకుడుగా మూడు దశాబ్దములు రాజ్యమేలిన ఆ మహానటుడు ఒక్క సంవత్సరం సినిమా రంగం నుండి విశ్రమించారు

## ఎంత ఘాటు ప్రేమయో

అలా ఒక్క సంవత్సరం సినిమా రంగానికి దూరమైన నటుడ్ని, ఆంధ్ర ప్రేక్షకులు మరువ లేదంటె, అతడి నటన్ను ఎంతగా ప్రేమిస్తున్నారో మరి

అందుకేనేమో దేవుడిమీద నమ్మకం లేదా అని ఆయన్ను ప్రశ్నించినప్పుడు, ప్రేక్షకులే నా దేవుళ్ళు అన్నారా మహానటుడు

తనకు జబ్బు చేసినప్పుడు, ఆరోగ్యంగా తిరిగి రావాలని లక్షలాది అభిమానులు మొక్కిన మొక్కులే, మళ్లీ మామూలు మనిషిగా స్వదేశానికి వచ్చానేమో అన్నారా మంచిమనిషి

కొత్తగా రంగప్రవేశం చేసిన ఆ వుత్తమ నటుడు, మరొక బరువయిన బాధ్యతను స్వీకరించాడు అదేమిటన ఆంధ్రప్రదేశ్‌లో స్టుడియో నిర్మాణం

## కొత్త బాధ్యత

తెనుగుగడ్డ మీద చిత్ర పరిశ్రమ అభివృద్ధి చెందగలదన్న ధృడనమ్మకం తనకు వుండబట్టే, స్టుడియో నిర్మాణానికి వుపక్రమించారాయన

స్టుడియోలో ఫ్లోర్ల నిర్మాణమే గాక, ప్రింటింగ్, రికార్డింగ్ వసతులు కూడా వుండగలవు అన్నారా కార్యశూరుడు

## లెక్క వివరం

ఇప్పటివరకు (అంటె ఆగస్టు 31 నాటికి) పదకొండు చిత్రాలలొ పనిచెయ్యడానికి అంగీకరించిన నిజాన్ని వెల్లడించారు

సంవత్సరానికి అయిదు చిత్రాల చొప్పున పని చెయ్యడానికి నిర యించారాయన



నెలకు రెండు x 12 రోజులు షూటింగులో రెండు చిత్రాలకు పని చెయ్యదలచినట్టు, ఆ లెక్క ప్రకారం నాలుగున్నర నెలలకు రెండు చిత్రాల షూటింగులు పూర్తికాగలవని, తొమ్మిది మాసాలకు నాలుగు పూర్తికాగలవని, ఒక నెల విశ్రాంతి తీసుకున్నా, మరో రెండు మాసాల్లో అయిదవది పూర్తవుతుందని ఆ మహామనీషి అన్నారు

## వాణిశ్రీ - ప్రభ

తెలుగు చిత్రసీమ గర్వించదగ్గ వుత్తమ నటిగా వాణిశ్రీని పేర్కొంటూ, యిప్పట్లో ఆవిడతో పోటీపడే నటి దుర్లభము అన్నారు

"మహాకవి క్షేత్రయ్య"లో తన సరసన నటిస్తున్న ప్రభకు వుజ్వల భవిష్యత్తు వుండగలదని, ఆమె నటన, మాడ్యులేషన్, స్వచ్ఛత పట్ల హర్షాన్ని వ్యక్తపరచారు

పదవయేట వరకు, తను వినాయకుడికి పూజ చేసేవారని, పుట్టలో పాలుపోసేవారని మాటల్లో బయటపెట్టారు

"మనసే దేవుడు" అని నమ్మే మనసున్న మనిషి గాబట్టే, మనుష్యులను మనస్ఫూర్తిగా ప్రేమిస్తారు

విగ్రహారాధన మీద నమ్మకం లేదేగాని, సుప్రిమెసీ మీద లేదని నేను ఎన్నడూ అనలేదే అన్నారాయన

"క్షేత్రయ్య" పాత్రను పిన్నలు, పెద్దలు, పండితులు, విద్యార్థులు, స్త్రీలు ఏకగ్రీవంగా ఆమోదించగలరన్న నమ్మకం ఆయనకు వుంది

"నేర్చినది రవ్వంత, నేర్వవలసినది కొండంత" అంటారాయన

## అపురూపమైన పాత్రల ఎంపిక

"బంగారు బొమ్మలు" లాంటి చక్కటి చిత్రంలో పని చెయ్యడం, "సెక్రటరి" వంటి మంచి చిత్రంలో పని చెయ్యడం తన అదృష్టంగా భావిస్తున్నారాయన

ప్రేక్షకులు పెట్టుకున్న ఆశలకు అనుగుణంగా తన పాత్రల చిత్రీకరణ వుండగలదని ఆంధ్ర ప్రదేశ్‌కు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక పాఠకుల ద్వారా హామీ యిస్తున్నారు

ఆయన ఎవరయ్యా అంటె! ఎవర్‌గ్రీన్ నాగేశ్వరరావుగారే

## ఎస్. పి వాయిస్

ఎస్ పి బాలసుబ్రమణ్యం వాయిస్ అంటె తనకు చాలా యిష్టమని, నిర్మాతలు ఆయన్ను పెడితె తనకు ఎలాంటి అభ్యంతరము లేదని వివరించారు

"గంతులు, ట్విస్టులు" ఎంతో కాలం వుండవని, మంచి చిత్రాలకు మాత్రమే ప్రజాదరణ లభించగలదని ఆయనన్నారు

తన కార్యక్రమాన్ని గూర్చి చెప్పినప్పుడు, ఆయనకంటె బిజీగా మరో హీరో వుండరేమో అనిపించింది

## పథకం !

"క్షేత్రయ్య" నవంబరుకల్లా పూర్తవుతుంది. జనవరి నుంచి 'బంగారు బొమ్మలు, సెక్రటరి' చిత్రాల షూటింగులు ప్రారంభమై, జూన్‌కల్లా పూర్తవుతాయి

జూన్ నుంచి ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, అన్నపూర్ణా పిక్చర్స్, కౌముదీ పిక్చర్స్‌కు (ఎవరికి కథ రెడీగా వుంటే వారికి) షెడ్యూల్స్ యిచ్చే అవకాశం వున్నదని, ఆయన ద్వారా తెలుసుకున్నాను

"ఎదురులేని మనిషి"లో ఎన్.టి. రామారావు



# సినిమా

## అగ్ర నటి ఖరీదు లక్ష వరహాలా ?

అగ్ర నటిని, లక్ష వరహాలిచ్చి తనతో తెచ్చాడు రంగనాథ్ ఆమెను అమితంగా ప్రేమించాడు ఆమెను తన అర్ధాంగిగా వూహించాడు ఆమే తన జీవిత రాణి కావాలని వుబలాటపడ్డాడు.

అందుకే ఆమెను లక్ష వరహాలకు కొన్నాడు అపురూప సౌందర్యరాశి అయిన ఆమెతో శృంగారం ప్రారంభించబోయాడు

ఆమెకు అతడంటె లేశమ్మైనా యిష్టం లేదాయె ! తనపై అయిష్టం కలిగే విధంగా ప్రవర్తించింది పిచ్చిగంతులు మొదలెట్టి, అతడ్ని వుక్కిరి బిక్కిరి చేసింది

అయినా ఆమెనే కాంక్షించాడా ? రంగనాథ్‌ను అగ్ర నటి ఆమోదించిందా ? అనేడి సందేహాలను తీర్చే శక్తి సుందరం మూవీస్ వారి "దొరలు – దొంగలు" చిత్రానికి వుంది ఈ చిత్రానికి కె ఎస్ ఆర్ దాస్ దర్శకుడు

ప్రసాద్ స్టుడియోలో "దొరలు –దొంగలు" వర్ణ చిత్రానికి గాను, నిర్మించబడిన సుందర హర్మ్యము యొక్క ఖరీదు లక్షన్నర అని తెలిసింది

నిర్మాత ఎమ్ సుందరరామిరెడ్డిగారిది భారీ హృదయం ఖర్చుకు వెనకాడక, వలసినంత వెచ్చించే మానసి కవితా హృదయమే గాక, కళా హృదయం కూడా వున్న రసజ్ఞుడు

"దొరలు – దొంగలు" చిత్రానికి మల్లెమాల రాసిన మాటలు మధురాతి మధురము అయితే, కవ్వించిన పాటలు స్వారస్యభరితము అనక తప్పదు

"కళాభినేత్రి" రాణిగా, అగ్ర నటి రంగిగా వైవిధ్యం వున్న ద్విపాత్రాభినయం వెయ్యడం "దొరలు – దొంగలు" చిత్రానికి ప్రత్యేక అలంకారం కాగలదు

రామకృష్ణ నాయకత్వంలో నిర్మితమయ్యే "దొరలు – దొంగలు" వర్ణ చిత్రానికి కె ఎస్ ప్రసాద్, సత్యం, ఏ కె శేఖర్ ముఖ్య సాంకేతిక సారధులు విజయా పిక్చర్స్ విడుదల

## చంద్రకళకు కొత్త నాయకుడు

కొన్ని పాత్రలకు చంద్రకళ మాత్రమే న్యాయం చెయ్యగలదు అనేది నిజం 'అందరికీ తెలిసినదే మన అగ్రశేణి హీరో లందరితో నటించి, సెహభాష్ అనిపించుకుంది

ప్రజలెరిగిన చంద్రకళ, ప్రజలెరుగని కొత్త నటుడు విజయప్రకాష్‌తో నటించడానికి సమ్మతించడం, ముదావహం

శివప్రసాద్ మూవీస్ నిర్మిస్తున్న "భాగ్యలక్ష్మి" చిత్రంలో నే రాసిన సంఘటన సంభవించింది

"జమిందారుగారి అమ్మాయి" చిత్రాన్ని జనరంజకం చేసిన సంగీతం శ్రీనివాసరావు "భాగ్యలక్ష్మి" కి నిర్దేశకుడు

కారంచేడు నివాసి, జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న "భాగ్యలక్ష్మి" చిత్రానికి రాజేశ్వరరావు, సుఖదేవ్, కృష్ణమూర్తి, బి, ఎల్ ఎన్ ఆచార్య వరుసగా సంగీతాన్ని, ఛాయను, కథను, రచన్ను నిర్వహిస్తున్నారు కథను పి నాగేశ్వరరావు రాశారు

కథా పాత్రలను జగ్గయ్య, గుమ్మడి, అల్లు రామలింగయ్య, శుభ పోషిస్తున్నారు

సెప్టెంబరు 10 నుంచి యిరవై రోజులు ఏకధాటిగా షూటింగు జరిగితే, అరు రీళ్ళు తయారవుతుంది

## కాంచనకు ఏం తక్కువ ?

బంగారువన్నె కలిగిన కాంచనకు ఏం తక్కువని మన దర్శక, నిర్మాతలు మర్చిపోతున్నారో ?

మరి, ఆవిడ మహానటుల సరసన శృంగార, సాత్విక నాయికగా నటించి రాణించలేదా ?

అందం లోపమా ? నటనలో బలహీనురాలా ? నృత్యం రాదా ? భాష తెలియదా ? అనేడి ప్రశ్నలకు సమాధానం అన్నీ వున్న నటి అనే వస్తుంది

ఆమె నటించిన చిత్రాలు నిర్మాతలకు ధన నష్టాన్ని కలిగించాయా అంటె, అరవై శాతం లాభం తెచ్చిపెట్టిన చిత్రాలే కనిపిస్తున్నాయి



'స్వర్గం–నరకం"లో మోహన్‌బాబు, అన్నపూర్ణ

నాకు జనించిన పై సందేహాలను నివర్తి చేసుకుందామని, గిరి రోడ్డులోని ఆమె భవంతికివెళ్ళాను

నే వెళ్ళిన తరుణాన, ఆవిడ కూచిపూడి నభ్యసించడానికి వెళ్ళినట్టు, తెలిసింది

ఎప్పుడొచ్చారు అంటూ బంగారు చిలక ప్రవేశించింది "బంగారు చిలక" అనడానికి కూడా కారణం వుంది

బంగారురంగు శరీరం, చిలకపలుకు ఆమె అధీనం గాబట్టి "బంగారు చిలక" అని సంబోధించాను

ఒకప్పుడు ఎంతో బిజీగావున్న మీరు ఇప్పుడు యింత ఖాళీగా వుండడానికి కారణం ఏమిటి అని అడిగాను

ఆమె నవ్వి, "కాలప్రభావం" అంది కానీ ఆమె నవ్వులో మూగ బాధ కనిపించింది

కూచిపూడి నేర్చుకుంటున్నారా ? "అవును విదేశాల్లో నృత్య ప్రదర్శన లివ్వొచ్చుని, ఒక మహోత్కృష్టమైన కళను అభ్యసించడంలో తప్పు కాదని నేర్చుకొంటున్నాను", అంది

మీకు నచ్చిన వేషం (యిటీవలి కాలంలో) ఏదయినా వచ్చిందా అని ప్రశ్నించాను

రామానాయుడుగారి "ఒక చల్లని రాత్రి" చిత్రంలో నే ధరిస్తున్న "సుజీ" పాత్ర, నా నట జీవితంలో కొత్త మలుపును తేగలదని నమ్ముతున్నాను" అంది కాంచన

తమిళంలో శివాజీతో, కన్నడంలో రాజకుమార్‌తో, నాల్గయిదు చిత్రాలలో నాయికగా నటిస్తున్న నిజాన్ని వెల్లడించింది

భవిష్యత్తు ఆశాజనకంగా వుండగలదన్న నమ్మకం వున్న కాంచనకు, అవశ్యం అట్టి దశ రాగలదు



"గుణవంతుడు"లో శోభన్‌బాబు, జయమాలిని

# "బాబు పొడుగ్గా, వెడల్పయిన బుజాలతో, గట్టి, తెల్లని పళ్ళతో పెరుగుతాడు."

# "ఎందువల్లనంటే, నేను కాల్షియం-శాండోజ్ తీసుకుంటున్నాను గనుక"

మీ పసిపాప పళ్లూ, ఎముకలూ మీరు గర్భిణీతో ఉన్నప్పుడే తయారవటం మొదలెడతాయి. అప్పుడే పాపకు కాల్షియం అత్యవసరం. దానిని మీరే యివ్వగలరు. తేలికైన కాల్షియం-శాండోజ్ పద్ధతిలో.

రోజుకు మూడు సార్లు 3-4 బిళ్ళల చొప్పున కమ్మని, రాస్ప్‌బెరీ రుచి కలిగి విటమిన్లు సి, డి మరియు బి$_{12}$తో పుష్టివంతం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళలను చప్పరించండి. మీ పాప గట్టి పళ్లూ, పటిష్టమైన ఎముకలూ కలిగినదిగా తయారు అవుతుంది. మీకు కాల్షియం లోపంగాని, కాళ్ళు పట్టటంగాని, కండరాల నొప్పిగాని ఉండదు.

శాండోజ్‌ను విశ్వసించండి—వారు ప్రపంచంలో శుద్ధమైన కాల్షియం తయారీ చేయడంలో ముందంజ వేసారు.









## కాల్షియం-శాండోజ్®

ప్రతి రోజు ప్రతివారికి



''మైకుంర పాలి''లో జ్యోతిలక్ష్మి

# సినిమా

### శోభన్‌కు నచ్చిన "బాబు"

ఈ మధ్య నేను, శోభన్‌బాబు, రాజబాబు తిరుపతి నుంచి మదరాసుకు ఒకే కారులో ప్రయాణం చేశాం

మా ముగ్గురి నడుమ చిత్ర పరిశ్రమకు సంబంధించిన ఎన్నో విషయాలపై చర్చ జరిగింది

సంభాషణం చేస్తున్న సమయంలో, ''బాబు'' చిత్ర దర్శకుడు రాఘవేంద్రరావును గూర్చి శోభన్ ప్రశంసా వాక్యాలు పలికారు

ప్రతి సంవత్సరం ఒక చిత్రం రాఘవేంద్రరావు దగ్గర పని చెయ్యడానికి శోభన్ నిర్ణయించినట్టు చెప్పి, దర్శకుడుగా రాఘవేంద్రరావుకు వుజ్వల భవిష్యత్తు వుందన్న నమ్మకాన్ని వ్యక్తపరిచారు

''బాబు'' లాంటి బలహీనమైన కథను కూడా, రాఘవేంద్రరావు బలేగా రూపొందించ, మంచి కథను మరెంతో మనోహరంగా మలచగలడన్న తన నిశ్చితాభిప్రాయాన్ని శోభన్ వెల్లడించారు

### రాఘవేంద్రరావు కొత్త చిత్రాలు

అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైసెస్ జయసుధ, మురళీమోహన్, సత్యనారాయణగార్లతో ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే చిత్రానికి రాఘవేంద్రరావు దర్శకుడిగా పదవీస్వీకారం చేశారు.

మారుతీ ప్రొడక్షన్స్ శోభన్‌బాబు, వాణిశ్రీ గార్లతో ఈస్ట్‌మన్ కలర్‌లో ప్రారంభించబోయే చిత్రానికి రాఘవేంద్రరావు దర్శకత్వం నిర్వహిస్తారు.

రాఘవేంద్రరావు రూపొందించిన ''బాబు'' చిత్రాన్ని తమిళంలో నిర్మించే హక్కును శివాజీ పిక్చర్స్ పొందియున్నది.

''బాబు'' చిత్రానికి ఖర్చు ఎక్కువ అయిన మాట నిజమయినా, నిజంగానే మంచి వసూళ్లను తెచ్చిపెట్టింది.

### గుణవంతుడు

ఈ చిత్రం నిర్మాతలు భట, ఎన్ ఎస్ మూర్తిగార్లను ధనవంతులు చెయ్యగలదు ప్రేక్షకులు ఆశించే శృంగారం, హాస్యం, కరుణ, భయానకం ''గుణవంతుడు'' చిత్రంలో వున్నాయి. ఈ చిత్రానికి ఆదుర్తి సుబ్బారావు, మహదేవన్, ఆత్రేయగార్ల సమిష్టి కృషి గణనీయమైనది

''గుణవంతుడు'' చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు. శృంగారరసానికి మంజుల, జయమాలిని పూర్తి న్యాయం చేశారు.

ఈ చిత్రంలోని సహాయ పాత్రలను అంజలీదేవి, కృష్ణకుమారి, ప్రభాకరరెడ్డి, మాడా, వెంకటేశ్వరరావు పోషించారు.

విజయదశమి పర్వదినాన ప్రేక్షకులను దర్శించేందుకు సన్నాహం అవుతున్న ''గుణవంతుడు'' చిత్రానికి అన్నపూర్ణ పంపిణీదారులు

### ఆదుర్తి పరిచయం చేస్తున్న జరీనా

రవి కళా మందిర్ వారి ''గాజుల కిష్టయ్య'' వర్ణ చిత్రం రసజ్ఞుల మెప్పును పొందే అర్హతను బడసియుంది

''ఆడవాళ్లను ఆకర్షించే ఘట్టాలు, యువకుల నాహ్లాదపరిచే సన్నివేశాలు, మధురానుభూతిని కలిగించే సంగీత సాహిత్యాలు, కన్నులకు విందొనర్చే ఛాయాగ్రహణం'' వున్న ''గాజుల కిష్టయ్య'' చిత్రం అక్టోబరులో శ్రీఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

విఖ్యాత దర్శకుడు ఆదుర్తి పరిచయంచేస్తున్న జరీనాను మన ప్రేక్షకులు ఆశీర్వదించే విధంగా ఆవిడ నటించింది. (సహాయ పాత్రలను అంజలీదేవి, కాంతారావు, గిరిబాబు, శుభ పోషించారు.) హీరో కృష్ణకు సరయిన పాత్రను సృష్టించగల ప్రతిభ ఆదుర్తికి గలదని నిరూపిస్తుంది 'కిష్టయ్య' పాత్ర.

సంగీతానికి మహదేవన్, ఛాయాగ్రహణానికి రామకృష్ణారావు, రచనకు సత్యానంద్, కూర్పుకు ఆదుర్తి హరినాథ్ సారధులు. ''గాజుల కిష్టయ్య'' చిత్రానికి ప్రసాద్, ఆదుర్తి భాస్కర్ నిర్మాతలు.

### అంజలీదేవి యింట వేల వుత్తరాలు

సెప్టెంబరు షెడ్యూలు ఎప్పుడో తెలుసుకుందామని చామియర్స్‌రోడ్డులోని అంజలీదేవిగారింటికి వెళ్లాను. నే వెళ్లినప్పుడు, ఆదినారాయణరావు, అంజలీదేవిగార్లు ''మహాకవి క్షేత్రయ్య'' కలర్ ఆల్బంను తిలకిస్తూ వున్నారు.

సెప్టెంబరు షెడ్యూలు యిరవై ఒకట్నుంచి ప్రారంభం అన్నారు. ఈ షెడ్యూలు పూర్తయితే, పది రీళ్ల చిత్రం తయారైనట్టే అన్నారు ఆదినారాయణరావు

''క్షేత్రయ్య'' చిత్రంలో 18 సెట్లు వున్నాయని, 16 పాటలు వుంటాయని చెప్పి, మధురై–తంజావూరు, కంచి మువ్వ మున్నగు క్షేత్రాలలో వరదయ్య యాత్రా విశేషాలను చిత్రీకరించాలని, అంజలీదేవి విపులీకరించారు

కొన్ని వేల వుత్తరాలు అభిమాన ప్రేక్షకుల దగ్గర్నుంచి వచ్చాయని, లేఖలున్న పెట్టెను చూపించారు

''క్షేత్రయ్య'' చిత్రం దిగ్విజయ యాత్ర చెయ్యాలన్నదే ఆ వుత్తరాల సారాంశం



ఆదిరాజా ప్రొడక్షన్స్‌వారి చిత్రం పాట రికార్డింగ్ సందర్భంలో సంగీతదర్శకుడు సత్యం, గాయని సుశీల, గాయకుడు మోహన్‌రాజ్‌లని చిత్రంలో చూడవచ్చు.

అక్కినేని నాగేశ్వరరావు ప్రత్యేక చిత్రం



# యువతరం

ఎస్ సీతారావమ్మకి నాట్యకళ అంటే సినిమాల్లోకి చేరే దగ్గరిదారి కానే కాదు ఆడయార్‌లో చిన్ననాటినుంచి వుండి కళాక్షేత్రంలో నృత్యకళలో పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లొమాతీసుకున్న యీ అమ్మాయికి, నృత్యశాస్త్రి అధ్యయనం నృత్యకళాభ్యాసం యిదే ప్రధాన లక్ష్యాలని చెప్తుంది సినిమాల్లో చేరాలన్నమోజులేదు నృత్యంలో అడ్వాన్స్‌డ్ కోర్సు గూడా పూర్తిచేసిన యీ యిరవై రెండు సంవత్సరాల అమ్మాయి కృష్ణాజిల్లానుంచే మద్రాసు కళాక్షేత్రానికి మరీ చిన్నవయస్సులోనే వెళ్లిపోయి చేరింది విజయవాడ ఒకసారి వచ్చి చూసినప్పుడు "నృత్య సంగీతాదులకు నిలయమైన మనప్రాంతం యిలా యీ రెండుకళల విషయంలోను దీక్ష తగ్గిపోయివుంటున్నదేమో" అన్న బాధ కలిగిందని చెప్పింది భరతనాట్యంలో "హిప్ మూవ్‌మెంట్స్" లేవు కాని ఎంతోమంది యీ శాస్త్రాన్ని నేర్చుకొన్న అమ్మాయిలు కొంత "వల్గర్ కదలికలను భంగిమలను సినిమా ప్రభావంచేత కాబోలు చూపెడుతున్నారు అని సీతారావమ్మ బాధపడ్డది "సౌత్‌లో వున్నంత డివోషన్ యీ శాస్త్రాధ్యయనంపట్ల మన ఆంధ్రాలో శాస్త్రాంనేర్పే 'మాస్టర్‌ల' లోనే లేదనిపిస్తుంది" అని ఈ అమ్మాయి అభిప్రాయ పడుతున్నది

యువ కళాకారుల బృందం సభ్యురాలుగా లోగడ కొన్నిదేశాలు తిరిగి వచ్చిన సీతారావమ్మ కూచిపూడికూడా అభ్యసించింది రష్యా వెళ్లే బృందంలో సభ్యురాలుగానుండబోతున్నది ఆమెకి భరతనాట్యం, కూచిపూడి ప్రాక్టీసు చేయడం, వాటిని నేర్పడం వీటితోనే తీరిక లేకుండా గడిచిపోతుంది కాని, సంగీతం కూడా నాలుగేళ్లుగా నేర్చుకుంటున్నది సంస్కృతం బాగా వచ్చునవిచెప్పింది యామినీ కృష్ణమూర్తి అంటే ఇష్టమట మద్రాసులో "అడయార్ స్కూల్ ఆఫ్ డ్యాన్స్" లోనే వుంటున్నది కనుక యింగ్లీష్,తమిళం, మాతృభాష తెనుగుతో పాటే బాగా వచ్చును ఎంతో బాగా డ్యాన్సు చేసే యీ అమ్మాయి నృత్యశాస్త్రంలో "డిప్లొమా" చేయాలనుకుంటున్నది



"టీచర్స్ డిప్లొమా" చేయాలనుకుంటున్నది కుమారి సీతారావమ్మకి వాళ్ల పెద్దవాళ్లు చూపిన మంచిసంబంధం—తన కళారాధనకు అడ్డురాని సంబంధం చేసుకోవాలనుందని చెప్పింది

— [ పి రాజీ ]

## సంక్రాంతి విందు

మనం వైభవంగా జరుపుకునే పండుగల్లో సంక్రాంతి ఒకటి ఆ పర్వదినాన తెలుగు చిత్రాలు (కనీసం) అయిదయినా విడుదలవుతాయి

ఈసారి సంక్రాంతికి వుత్తమోత్తమయిన చిత్రాలు విడుదల అవుతాయి అన్నీ వర్ణ చిత్రాలే

సంవత్సరం తరువాత, 'నటసామ్రాట్' నటించిన మహాకవి క్షేత్రయ్య" విడుదలవుతుందంటే, ఆ చిత్రం బాక్సాఫీస్ వద్ద అఖండ విజయాన్ని సాధించకుండా వుంటుందా? అక్కినేని చిత్రం ఎప్పుడొస్తుందా అని వేయి కళ్లతో ఎదురుచూసే ప్రేక్షకకోటికి "క్షేత్రయ్య" అపూర్వ కానుక కాగలదు (తారకరామ ఫిలింస్)

జగపతి స్టాఫ్ ఎంటర్‌ప్రైజస్ వారి "పిచ్చి మారాజు" వర్ణ చిత్రం సంక్రాంతి కానుకగా విడుదల కాగలదు రాజేంద్రప్రసాద్‌గారి చిత్రం పట్ల ప్రేక్షకులకు ప్రత్యేకమైన యింటరెస్టు వున్నది నిజం గాబట్టి, ఆ చిత్రానికి ఘనవిజయం తథ్యము (అన్నపూర్ణా విడుదల)

చిరంజీవి బాలకృష్ణ కథానాయకుడుగా నటించిన "వేములవాడ భీమకవి" వర్ణ చిత్రం ప్రజలను విశేషంగా ఆకర్షించగలదు తండ్రి నటరత్న, తనయుడు బాలకృష్ణ కలిసి నటించిన "భీమకవి" చిత్రానికి అఖండ స్వాగతం లభించగలదు (విజయా విడుదల)

ప్రేక్షకులు యిష్టపడే నాయకత్రయం రామారావు, నాగేశ్వరరావు, శోభన్‌బాబుగార్లు నటించిన మూడు వర్ణ చిత్రాలతోబాటు మరో రెండు చిత్రాలు సంక్రాంతికి విడుదల అయ్యే సూచనలు కనిపిస్తున్నాయి

## పెద్ద సంస్థల్లో పాత్రో ప్రవేశం

నాటక రచయితగా నీరాజనాలందుకొంటున్న రచయిత గణేశ్‌పాత్రో "నాకూ స్వతంత్రం వచ్చింది" ద్వారా చిత్ర రచయిత అయ్యారు

గణేశ్‌పాత్రో కలం బలమైనదని ప్రముఖ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు చెప్పారు అదే అభిప్రాయాన్ని విఖ్యాత నిర్మాత ఏ వి సుబ్బారావు వెల్లడించారు

అన్నపూర్ణ, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించే చిత్రాలకు పాత్రో సంభాషణలు రాస్తున్నారు

అన్నపూర్ణాకు తాతినేని రామారావు, పి ఎ పి కి ప్రత్యగాత్మ దర్శకులు

గణేశ్ సినిమా రచయితగా ప్రకాశించగలడన్న నమ్మకం పెద్దలకు వున్నదిగాబట్టి, పాత్రో ఆ నమ్మకాన్ని నిజం చెయ్యాలి

## ఏ చిత్రం ఎవరికి పేరు తెస్తుంది?

రాబోయే చిత్రాలలో ఏ చిత్రం ఎవరికి పేరు తేగలదో వ్రాయమంటారా!

"దేవుడే దిగివస్తే" చిత్రం సత్యనారాయణ అంతస్తును మరింత అధికం చెయ్యగలదు

"వైకుంఠపాళి" చిత్రం శారదకు పేరు తేగలదు శారద కొత్త గెటప్‌లో ఆకర్షణ పాలవుతారు

"గుణవంతుడు" చిత్రం "హీ—మాన్" పాపులారిటీని యింకా పెంచగలదు

"సోగ్గాడు" చిత్రంలో శోభన్‌బాబు వెరైటీ పాత్ర పోషణకు ప్రేక్షకుల ఆదరణ, ఆమోదం లభించగలదు జయసుధను మంచి నటి అని ప్రేక్షకులు అంగీకరిస్తారు

"దేవుడులాంటి మనిషి" చిత్రం కృష్ణకు కొత్త కిరీటాన్ని తెచ్చిపెట్టగలదు నాగభూషణం నటన 'ఏ' వన్ అనగలరు

"ఎదురులేని మనిషి" చిత్రం నటరత్న యిమేజ్‌ను మరింత పెంచగలదు అగ్రనటిని ఏకైక అందాల నటిగా ప్రేక్షకులు ఒప్పుకొంటారు

"ఆరాధన" చిత్రం నందమూరి, వాణిశ్రీ లిద్దరికీవిపరీతమైన పేరుతెచ్చిపెట్టగలదు మహ్మద్ రఫీ పాటలకు శ్రోతల అభిమానం లభించగలదు

"స్వర్గం — నరకం" చిత్రం కొత్త నటుడు ఈశ్వరరావుకు వెలుగు చూపించగలదు

"కోటలో పాగా" చిత్రం రామకృష్ణకు "జానపదరాజా" బిరుదాన్ని తేగలదు కన్నడ నటుడు సుదర్శనమ్ విలన్‌గా ప్రజలను ఆకర్షించగలదు

"అమ్మా — నాన్నా" చిత్రం కృష్ణంరాజు యొక్క స్థాయిని పెంచగలదు

"ఈకాలపు పిల్లలు" చిత్రం దేవదాస్, ప్రభ, రామకృష్ణలకు కీర్తి సార్జించిపెట్టగలదు

"ఈ కాలం దంపతులు" చిత్రం జమున స్టేటస్‌ను పెంచగలదు కొత్త నటి హేమా చవుదరిని ప్రేక్షకులు ఆదరించగలదు

— శ్రీనివాస్

"తీర్పు"లో ప్రభాకరరెడ్డి, సంగీత



మాధవ్‌కి ఇద్దాం అని మీరు ఆశిస్తున్నారని ముందుగా తెలిస్తే నేను మాధవ్‌తో ఇంత స్నేహాన్ని పెంచుకుని ఉండేదాన్ని కాదు'' అంది డగ్గుత్తికతో.

''మావయ్య ఎప్పుడూ నా సంగతి నీకు చెప్ప లేదా ?'' తీక్షణమైన స్వరంతో అడిగింది రాధ ...

అప్పుడే లోపలికి వస్తున్న మాధవ్... ''ఆగు రాధా... దానికి సమాధానం నేను చెప్తా...'' అన్నాడు, ఇంట్లోకి అడుగు పెడుతూనే జరిగిన సంగతి అర్థం చేసుకుని, రాధకి సమాధానం గట్టిగా ఇద్దాం అనే ఉద్దేశంతో.

అంతా మాధవ్‌కేసి చూశారు.

మాధవ్ ఒక నిశ్చయానికి వచ్చినవాడిలా ముఖం పెట్టి ''బావా... మీరు నామీద ఆశలు పెంచు కున్నట్లే, ఉష మీద ప్రభాకరం కూడా ఆశలు పెంచుకుని ఉన్నాడు... కాని నా కోసం ఉష, అతని ప్రేమని వదులుకొని, కృతజ్ఞత అనేది మనస్సుని పీడిస్తున్నా, నా పక్కకి వచ్చి నిలిచింది... ఇంత త్యాగం చేసిన ఉషకి నేను ఎలా తగుతానా అని మొన్నటి నుంచీ మథనపడుతున్నాను... ఇప్పుడా మానసికమైన బాధ పోయింది... ఎమంటే నేనూ ఉష లాగే నన్ను, పెద్ద చేసిన మీ కోరికని కాదని ఉషని పెళ్లాడబోతున్నాను... దీనికి కారణం, మా ఇద్దరిలోనూ కృతజ్ఞత లేక కాదు... స్వార్థం ఉండీ కాదు... ఇది లోక సహజం... పిల్లని పెంచి పెద్ద దాన్ని ఒకళ్ళు చేస్తారు... ఆ సమయానికి వచ్చి ఆమెని మరొకళ్ళు తీసుకుపోతారు... పిల్లాడి విష యంలోనూ అంతే... చదువు చెప్పించి ఒకళ్ళు మనిషిని చేస్తే, ఆ మనిషిని మరో అమ్మాయి వచ్చి స్వంతం చేసుకుంటుంది... అది అన్యాయం అంటామా... కృతఘ్నత అంటామా... అది అంతే... ఇంతకీ నాకు కావలసిన లక్షణాలన్నీ ఉషలో ఉన్నాయి... ఉష కోరుకొన్న యోగ్యతలన్నీ నాలో ఉన్నాయి... ప్రపంచంలో ఒక అన్యోన్యం అయిన ఆదర్శ దాంపత్యం ఏర్పడాలంటే మా నిర్ణయాల్ని ఆశీర్వదించండి... లేక కృతజ్ఞతలూ విధేయతలూ అంటారా... కానియ్యండి... మహోన్నతంగా ఎదిగి దిక్కులన్నీ ఆనంద పరిమళాలతో నింపేయవలసిన రెండు మంచి గంధం చెట్లని వేళ్ళు నరికి నిర్జీవంగా మిగల్చండి...'' అలా మాధవ్ ఉద్రేకంతో మాట్లాడు తూంటే, గురుమూర్తి సీతమ్మా రాధలతోబాటు, ఉష కూడా విస్తుబోయి వింటూ ఉండిపోయింది. ఒక్క క్షణం ఆగి, పంచె చివళ్ళతో కళ్ళు వత్తుకొని, బొంగురుపోయిన కంఠాన్ని సవరించుకొని ... ''మాధవ్ ! నేను మనస్పూర్తిగా మీ ఇద్దర్నీ ఆశీర్వ దిస్తున్నానురా... నిజమే... మీ దాంపత్యం బాగుం టుంది... నువ్వు ఉషనే పెళ్లి చేసుకో. కావలిస్తే మనం రాధకి మరో సంబంధం చూద్దాం'' అన్నాడు గంభీరంగా గురుమూర్తి.

''నిజంగానా బావా ! నువ్వు మనస్ఫూర్తిగా అంగీకరించావా ?'' అంటూ డగ్గుత్తికతో అడిగిన మాధవ్‌నీ,

''మీకేమైనా మతి పోయిందేవిటండీ !'' అని అరిచిన సీతమ్మనీ,

''నాకెవరు పెళ్లి సంబంధాలు చూడక్క ర్లేదు'' అన్న రాధనీ,

# గా జు మే డ

(23వ పేజీ తరువాయి)

''మీ ఔన్నత్యం...'' అంటూ ఆపైన మాట్లాడలేకపోయిన ఉషనీ,

అందరినీ, ''ఆగండి'' అని ఒక్క అరుపుతో శాసించి ఆపి, ''ఇంకెవరూ మాట్లాడ్డానికి వీల్లేదు. ఇంకీ ప్రకరణం యింతటితో ముగిసింది'' అంటూ డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు గురుమూర్తి.

## 21

''అమ్మా ! ఇవాళ ఎలావుంది ? నిన్న కొత్త ఇంజక్షన్ యిచ్చాక కొంచెం బాగుందా ?'' గట్టిగా చెవిలో అరుస్తూ, అడిగాడు ప్రభాకరం.

''ఏం బాగు ? అదే బాగు ! హుం ! లేచేది వుందా ఏవన్నానా ? ఏదో వెళ్ళిపోతుంది ఘటం'' అంది జోగమ్మ. నూతిలోంచి వచ్చినట్లుంది కంఠం.

## న మ్మా — న మ్మ క పో

* ★ 1360 లో మొదటిసారిగా నిర్మించిన గడియారం రోజుకు రెండు గంటలు తప్పు చూపించేదిట.
* ★ పిచిక మెడమీద వుండే ఎముకల సముదాయం జిరాఫీ మెడమీద వుండే ఎముకల మొత్తంకన్న రెట్టింపు.
* ★ భూమిమీద వుండే నీటిలో మూడవ శాతం మంచినీరు. అందులో మూడవ వంతు ఎప్పుడూ గడ్డ కట్టుకొని వుంటుంది.
* ★ మూడు రంగులు గల ట్రాఫిక్ లైట్‌లు మొదటిసారిగా 1928 లో బ్రిటన్‌లోని 'వుల్‌వర్‌హామ్‌టన్' నగరంలో వుపయోగించ బడ్డాయి.
* ★ ''బిగ్‌బెన్'' అంటే గడియారం అనే వుద్దేశ్యం కాదు. బ్రిటిష్ పార్లమెంట్ హౌస్ టవర్‌న వుండే గంట నుద్దేశ్యింపబడినది.
* ★ దక్షిణ ఇటలీలోని బ్రహ్మచారులు తామింకా అవివాహితులమే అని తెలియజేయడానికి — వారు ధరించే (టోపీకి) చుట్టూ ఎర్ర పట్టీలు ధరించేవారట !

సేకరణ : చావలి సుబ్బలక్ష్మి

''హార్లిక్స్ తీసుకున్నావా ?''

''ఆc ! అన్ని లాంఛనాలూ అయ్యాయి.''

''మరైతే నేను హాస్పటల్‌లోకి వెళ్లివస్తాను. నువ్వు కళ్ళుమూసుకు పడుకో.''

''పడుకోవడమే...ఏక పడుకోవడం...ఎన్నేళ్ళు యిలా పడుకోవాలో ! ఆ వేణుమాధవస్వామికి దయ వచ్చి తీసుకుపోయేదాకా.''

ప్రభాకరం నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ హాస్పటల్‌లోకి వెళ్ళాడు. ఎన్ని మందులిచ్చి ప్రయత్నం చేస్తున్నా అమ్మ నానాటికీ క్షీణిస్తూనే వుంది. నయం అయే ఎత్తేదీ కనిపించడంలేదు. లేచి తిరక్కపోయినా అలా మంచంమీదైనా ఎదురుగా అమ్మ వుండాలి. లేకపోతే తను బతగ్గలడా ! ... ఈ ఆలోచనలతో మనస్సు మరింత వెలితిగా, శూన్యంగా అయింది.

హాస్పటల్‌లోకి వెళ్ళి తన గదిలో కూర్చున్నాడే కాని, పేషెంట్స్‌ని ఎవర్నీ చూడలేదు. వచ్చిన వాళ్ళనందర్నీ అలా డాక్టరమ్మగారి దగ్గరకు వెళ్ళం డని, బయట నుంచుని సీతాలు రోజూలాగ చెప్తు న్నాడు. ఈ మధ్య ఇదే తంతు శారీరకంగా అనారోగ్యం ఏం లేకపోయినా, మానసికంగా ఏం స్థిమితం ఉండడంలేదు... మనస్సు ఏక చికాగ్గా బలహీనంగా ఉంటోంది... ఏ పనీ చెయ్యబుద్ధి వెయ్యడంలేదు... నెల్లాళ్ళ టపా, టేబిల్‌మీద అమట్టునే ఉంది. ఒక్క ఉత్తరం తెరిచి చదవ లేదు .. ఒక్క ఉత్తరం రాయలేదు... ఉష ఇచ్చిన టెలిగ్రాంకి జవాబుగా రాసిన ఉత్తరమే !... మళ్లీ ఏం రాశాడు తను !

ఉష ఎలా ఉందో... పరీక్షలు కదూ... బాగా చదువుకుంటూ ఉండి ఉంటుంది...ఈ సమయంలో ఉష ఉంటే తనకి కొంత సరదాగా ఉండి ఉండును... ఈ ఏకాంత సమయంలో ఆత్మీయు లెవరూ లేక మతి పోతోంది... అప్పుడప్పుడు జానీ సన్నగా నవ్వుతూ మాట్లాడినప్పుడు మాత్రం మనస్సుకి కాస్త రిలీఫ్‌గా ఉంటోంది.. అంటే?... తనకిప్పుడు స్త్రీ సహచర్యం అవసరమా... అందుకేనా బ్రతు కంతా ఏదో 'డల్'గా ఉన్నట్లనిపిస్తున్నది !

సింగారం చిందించే పడతీ, చిరునవ్వులు పండించే పసివాళ్ళూ లేని ఇల్లు ఇల్లే కాదంటారు పెద్దలు, ఇందుకే కాబోలు !...

ఉషని చదువు మానిపించేసి తీసుకువచ్చి పెళ్లి చేసేసుకుంటే ?... ఇప్పుడా ?... ప్రభాకరానికి నవ్వ వచ్చింది... ఇప్పుడా ఈ ఆలోచన ?... దాహం వేశాక నుయ్యి తవ్వించాలని ప్రయత్నించిన వెర్రివాడిలా ?

జానీ ఒకటి రెండుసార్లు 'కన్‌సల్టేషన్' కోసం ప్రభాకరం గదిలోకి వచ్చింది... ''ఏవిటి డాక్టర్ మీరు రోజు రోజుకీ డల్‌గా అయిపోతున్నారు !'' అంటూ బాధ పడింది. ప్రభాకరం ఏం మాట్లాడ కుండా టేబిల్‌మీద ఎదురుగా పడి ఉన్న తెరవని కవర్లనీ, చదవని కార్డుల్నీ ఊరికే ఇటూ అటూ కదుపుతున్నాడు... ''పాపం పసివాడిలా తనకి ఏం కావాలో ఇతనికి తెలియడంలేదు... తనకి తెలుసు... ఆ చూపులవల్ల అర్థం అవుతోంది కూడా... ఆప్యాయం ఉన్న ఆడది అదుకుంటే ఈ 'డల్‌నెస్' ఎక్కడిదక్కడ పోతుంది. ఆ జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి తల నిమురుతూ, అతని తలని గాఢంగా గుండెలకి హత్తుకుంటే...హమ్మో... ఈ ప్రభాకరం దగ్గర అంత చనువు తీసుకోవడమే !'' ఇలా ఆలో చిస్తూ ఉండిపోయింది జానీ.

యధాలాపంగా చూస్తూంటే ఉష రాసిన కవరు కన్పించింది — సరిగ్గా అదే సమయంలో పక్కని నిలబడ్డ జానీ ''ఏదో అస్థిమితంగా కనిపిస్తు న్నారు. పోనీ వెళ్లి రెస్ట్ తీసుకోండి. ఇక్కడి పని అంతా నేను చూసుకుంటాను'' అంది. ప్రభాకరం ఒక్కమారు ఆమె కళ్ళల్లోకి కృతజ్ఞతగా చూసి ''థేంక్స్'' అంటూ లేచి, ఉష ఉత్తరం తీసుకుని ఇంట్లోకి మేడమీదకి వెళ్లిపోయాడు.

[ఇంకా ఉంది]

అంతర్జాతీయ మహిళా సంవత్సరానికొక
అపూర్వ కానుక।
భారత నారీ ఆదర్శ
శీల సంపదను
సోదాహరణంగా
నిరూపించే చిత్రం।

ఏ.వి.కె. ప్రొడక్షన్స్

# లక్ష్మణరేఖ



నిర్మాతలు:
పి.యం.షణ్ముగం & ఏ.వి.కృష్ణారావు

దర్శకత్వం:
ఎన్.గోపాలకృష్ణ B.Sc.,

నిర్వహణ:
ఎమ్.వెంకటరత్నం

సంగీతం: సత్యం

ఆంధ్ర రిలీజ్ రైట్స్: భాస్కర మోటార్ ట్రేడింగ్ & ఫైనాన్స్ కార్పొరేషన్ - కాకినాడ

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**సిస్టర్ దేవదీవన**

రోగులపాలిటి దేవుని దీవన సిస్టర్ దేవదీవన : మూర్తీభవించిన మానవతా భావన సిస్టర్ దేవదీవన. ఆమె ముక్తసరిగా మూడు మాటలే మాట్లాడుతుంది. చేతలే ప్రధానం ఆమెకు. రోగులకు శ్రీరామరక్ష అయిన చిరునవ్వు. ఎంత గట్టిగా మాట్లాడినా పట్టుమని పది అడుగులైనా దాటని మెత్తని ధ్వని ఆమె సొమ్ము. కండ్ల పట్టీలతో కదలక మెదలక మంచంపై పడివున్న రోగులను ఆప్యాయతతో పలకరించి చెంచాతో పాలు వారి గొంతులో పోస్తున్న ఆమె నాకు సాక్షాత్తు అన్నపూర్ణగానే కానవచ్చును. రోగులు చాలును అన్నా, "బాబూ, మరికొంచెం తాగు, తాగక పోతే ఎట్లా ధారకం ఒద్దూ" అంటూ కన్నతల్లి ప్రేమతో పాలుపోసే ఆమెను అన్నపూర్ణ కాక మరేమంటాము. పొగడ్తలు ఎంత మాత్రమునిగిట్టని సిస్టర్ దేవదీవన సరళత, సహజవాత్సల్యం ఏ రోగినైనా బాగు చేస్తాయి. ఈమె పశ్చిమ గోదావరి జిల్లా అనపనవారిగూడెంలో జన్మించింది. కృష్ణా జిల్లా ఇందుపల్లిలో అమ్మమ్మగారి ఇంట విద్యాభ్యాసం చేసింది. మానవసేవా దృష్టితో హైదరాబాద్‌లో నర్సు ట్రైనింగు పొందింది. మూడు పదుల ఇప్పుడిప్పుడే మించిన ఈమె 10 సం.లుగా సరోజినీదేవి కంటిఆసుపత్రిలో సిస్టరుగా పని చేస్తుంది. సిస్టర్ దేవదీవన వంటివారే తక్కిన అక్కడి సిస్టర్లు మేరీ, సుశీలాడేవిడ్ మొదలైన వారు. రోగుల పాలిటి తల్లులైన వీరిని భగవంతుడు ఎప్పుడూ కరుణించుగాకఅని కోరుకోవడంకంటే నాబోటివాడుమరేమిచేయగలడు.

**ఖండవల్లి నరసింహశాస్త్రి:**

ఆకు పచ్చని జరీ బుటేదారీశాలువా కప్పుకొని నీర్కావి ధోవతి కట్టుకొని, పాండిత్య వినయాల భరంతోనా అన్నట్టు ఈషద్వినమిత గాత్రంతో నడిచే స్వర్ణద్రూపం సదాచార నిష్ఠలాల కాంతిపుంజమైన ముఖం, ఎవరైనా నమస్కరిస్తే, కుడి చేయి సగం ఎత్తి హసన్ముఖంతో ఆదరించే పద్ధతి ఎవరికీ ఇబ్బంది కలుగరాదనే బుద్ధితో ప్లాట్‌ఫారంపై వోరగా నడిచే తీరు— ఇవి గమనించండి. ఆయనే శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు. దగ్గరికి వెళ్లి చూస్తే కనిపిస్తుంది ఆయన వర్చస్సు. ఆ వర్చస్సంతా పెద్ద పెద్ద కన్నులనుంచే ఎదుటివారిపై ప్రవహిస్తుందా అన్నట్లు ఉంటుంది. ఆయన పొడుగాటి పెద్ద చెవులు, కోటేరువంటి ముక్కు, చక్కని పలువరుస ఆయన మహావ్యక్తిత్వానికి మరింత వన్నె నరసింహశాస్త్రిగారు.

వ్యాకరణ, సాహిత్య, ధర్మశాస్త్ర పారంగతులు సదాచార సంపన్నులు. సుందర కాండ, భగవద్గీత నిత్య పారాయణాలు. నమకచమకాలతో నిత్య పూజ ఏ పరిస్థితులలోను తప్పరు. వారి జన్మస్థలం మహబూబునగర్ జిల్లా. గోపాలపేట సంస్థానం. అక్కడే బాల్యంలో శ్రీ పల్లా నరసింహశాస్త్రిగారి వద్ద పంచకావ్యాలు, కౌముదీ పరిభాషేందుశేఖరం చదివారు. పిదప అకిరిపల్లి సంస్కృత కళాశాలలో గోడపర్తి సంపత్కుమారాచార్యుల వద్ద భాష్యాంతం వ్యాకరణం చదివారు. పిదప పిఠాపురం వనపర్తి పరీక్షలిచ్చి ఉత్తమ బహుమతులు పొందారు. 1943 నుంచి 1968 వరకు సీతారామ్‌బాగ్ వేదాంత వర్ధనీ సంస్కృత కళాశాలలో వ్యాకరణాధ్యాపకులుగా వుండి వందలాది శిష్యులను అన్ని వర్ణాంలోను తయారు చేశారు. యాదగిరి గుట్ట దేవాలయం ఆస్థానకవి గానూ వనపర్తి సంస్థానంలోను వ్యాకరణం పరీక్షకులుగాను తిరుపతి వేదశాస్త్రాగమ సభ పరీక్షకులుగాను ఉన్నారు. ఇక సన్మానాలకు, వాక్యార్థాలకు కొదువ లేదు. అన్ని సంస్థానాలలోను సన్మానాలు పొందారు. శృంగేరి కామకోటి మఠంలో వ్యాకరణ వాక్యార్థాలు చేసి ఉత్తమ సన్మానం పొందారు. ఉద్యోగానికి అవసరం లాగా వ్యాకరణ సాహిత్య శిరోమణి పరీక్షలలోను ఉత్తీర్ణులయ్యారు.

శాస్త్రిగారి వాచకం బహు దొడ్డది. భాగవతం 18 వేల శ్లోకాలు 24 గంటలలో పారాయణం చేస్తారు. 'వాచకశిరోమణి' అని ఆయనకు చిన్ననాటి బిరుదు. ఆయనకు 12 సంవత్సరాల ప్రాయం నాటిమాట మహారాజా గోవిందనాయక్‌గారు కృష్ణాతీరంలోని యాపర్ల క్షేత్రంలో భాగవతసప్తాహం చేయించదలచారు. నరసింహశాస్త్రి గారి వాచకం తెలిసిన బాలసరస్వతి శ్రీనివాసాచార్యులుమొదలయిన వారు ఆయననూ రమ్మన్నారు. కాని గోవింద నాయకునికి నమ్మకం కలుగక పోయినా, పండితులు చెబుతున్నారు గదా అని ఆయనను నియమించారు. ఆయన అందరికీ ఆశ్చర్యం కలిగేట్టు భాగవతం చదివారు. బాల్యంలో ఈ వాచక శిరోమణికి ఆత్మకూరులో మరొక పరీక్ష తగిలింది కొందరు వైష్ణవ పండితులు ఆయన సత్తాతెలుసుకొనడానికి తిరువాయ్‌మొళి అందించారు. ఆయన సంస్కృతాంధ్రాలలాగే గడగడ చదివారు. ఇది ఈ వాచకాభరణుని పూర్వ పఠనశక్తి.

అయినా శంకర విజయానికి కొంతవరకు వ్యాఖ్య చేశారు. భగవద్గీతావ్యాఖ్య, సప్తగిరి మహాత్మ్యం, శివలీల వేములవాడ రాజేశ్వర కల్యాణం మొదలైన సంస్కృత రచనలు చేశారు. రేడియో ప్రసంగాలు చాల ఉన్నవి. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశానికి వ్యాకరణ శాస్త్ర విషయ వ్యాసాలు చాల వ్రాశారు.

సంస్కృత భాష సంబంధంలేని తెలుగు లేదు గనుక తెలుగు అభివృద్ధికి సంస్కృత వాఙ్మయం, అందులోను వ్యాకరణం ఆవశ్యకమనీయమని శాస్త్రిగారు గట్టిగా చెబుతారు! నరసింహశాస్త్రిగారి వంటి మహా విద్వాంసుని, పాండిత్య సచ్ఛీల, సదాచార [illegible] ముని, నిష్కళంకుని కన్న తల్లిదండ్రులు శ్రీయుతులు లక్ష్మణశాస్త్రి, అనంతమ్మగార్లు ధన్యులు. సప్తతి నిండిన శాస్త్రిగారు కనీసం సహస్రమాస జీవులై ఇంకా చాల రచనలు చేయాలి.

**ఉపశ్రుతి:**

"రాండయ్యా రాండి రెప్పలు కత్తిరిస్త. రంగు పూస్త" అంటూ ఆసుపత్రిలో నా దగ్గరికివచ్చాడు వార్డు అటెండర్ రాజమల్లయ్య, కత్తెరను చప్పుడు చేస్తూ. "రెప్పలు కత్తిరించడం ఏమిటి, రంగులు వేయడం ఏమిటి పొడుగాటి రెప్పలు అతికించుకొనడానికి నేను సినిమా స్టార్ కాదుకదా ?" అన్నాను. "సినిమాటారు ఆడసారమీరు ఆపరేషన్ థియేటర్‌లో రేపు టార్" అన్నాడు రాజమల్లయ్య. కదులుతున్న అతని కత్తెరవైపు చూస్తూ నిలబడి పోయాను ●

## ఉష్ – నిశ్శబ్దం

డా॥ సి. నారాయణరెడ్డి

ఉష్ —

నిశ్శబ్దం.
ఎవరూ మాట్లాడొద్దు
నిశ్శబ్దం; పరమ నిశ్శబ్దం.

సూర్యుడు నిశ్శబ్దం
చంద్రుడు నిశ్శబ్దం
చుక్కలు నిశ్శబ్దం; అష్ట
దిక్కులు నిశ్శబ్దం.

మోహం నిశ్శబ్దం.
స్నేహం నిశ్శబ్దం.
మృత్యువు నిశ్శబ్దం; నిసర్గ
సత్యం నిశ్శబ్దం.

* * *

అన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి
సంప్రదాయ బద్ధంగా ఉన్నాయి.
అయినా విను విను
అటు అటు శ్రుణు శ్రుణు!
నిశ్శబ్దాన్ని రెండుగా చీల్చి
గతాన్ని వర్తమానంలో పేల్చి
అధిగమిస్తున్న దొక శబ్దం
అదే అభినవ సృష్టికి ప్రళయాబ్దం.

# “నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు.



ఇప్పుడు నాకు ‘కేర్ ఫ్రీ’ సానిటరీ నేప్‌కిన్‌లను గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!”

వండర్ రాప్‌గల క్రొత్త కేర్ ఫ్రీ స్త్రీయొక్క దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేకమైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను తీసుకొనుటకు యిప్పుడు కేర్ ఫ్రీ ఉంది.

కేర్ ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్ రాప్ చెమ్మను లోపలి పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్ ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి చెమ్మను ఏకరీతిగా చేరేలా చేసే, ప్రత్యేకమైన పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది. అందువలన నేప్‌కిన్ విడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్ ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటె, దానిని ఉపయోగించిన తరువాత సులభముగా ‘ఫ్లష్’ చేయవచ్చును. కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో చికాకు పడరు

కేర్ ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా సరిపోయేలా మార్చుకోగలిగే సైజులో లభిస్తోంది. ప్రతి ప్యాకులోను ఉచితముగా యివ్వబడే కేర్ ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ మంచి వస్తువులు కావాలనే స్త్రీలకు క్రొత్త, మేలు రకపు, మార్చుకోగలిగే బెల్టు విడిగా అమ్మబడుతోంది. దానిని కేర్ ఫ్రీ సానిటరీ నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి.




జాన్సన్ & జాన్సన్* స్త్రీలకు హాయియైన రక్షణకు

* Trade Mark © Johnson & Johnson India Ltd.

సీరియల్

# రాగవీచికలు

శ్రీదూరి

వేంకట సీతారామమూర్తి

అందరూ వెళ్ళిపోయాక గదిలో కూర్చుని రాణివంక చూశాడు ఆనందరావు. ఆమె అమాయకత్వం కన్పించిందతనికి. దుఃఖాన్నంతా మింగుకున్న ఆమె మనసింకా కుదుటపడలేనట్లుంది.

తాతగారామెను యేకాకినిచేసి వెళ్లిపోయినపుడు తానామె పక్కనే వున్నాడు. అన్నీ తన చేతులమీదుగానే జరిగాయి. ఆ స్థితిలో రాణిని వంటరిగా దిక్కులేని దానిగా వదిలివేయటానికతని మనసొప్పలేదు. అందుకే తన నిర్ణయాన్ని అందరి ముందు వుంచాడు యేదియేమైనా తను చేయదల్చుకున్నది చేయాలనుకున్నాడు. చేశాడు కూడ. ఆ సంతృప్తి చాలు!

సిగ్గుతో వంగిన ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకుని సంతృప్తిగా పొదివి పట్టుకున్నాడు.

ఆ క్షణంలో మాటలే కరువయ్యాయి!

* * *

"మొత్తానికి నువ్వనుకున్నది జరిపించేశావు. ఇక నేననుకున్నదెప్పుడో మరి?" రజనీకాంత్ వర్ధని ముఖంలోకి చూస్తూ అన్నాడు.

కొండపై నుండి ప్రకృతిని చూస్తున్న దల్లా చటుక్కున అతనివంక చూసి, "యేమోబాబూ నాకేదో భయంగానే వుంది. మీరేమో యీ కొండంత ఎత్తున వున్నారు. నేనదుగో ఆ కనిపించే నీటి మడుగంత దూరాన క్రిందనున్నాను. మనమధ్య ఓ పెద్ద లోయ."

బస్సురోడ్డు దాటి, ఓ చెట్టు క్రింద కూర్చున్నారిద్దరూ. నీరెండ అంతటా పరుచుకుంది.

"యేమో వర్ధనీ నాకవన్నీ తెలీవు. మీ అన్నయ్యను ఒప్పించే బాధ్యత నాది. యిక మిగతా విషయాలు నువ్వు చూసుకోవాలి"

*(గత సంచిక తరువాయి)*

"ఇంకెవరున్నారు. నే చెబితే మామయ్య కాదనరన్న ధైర్యముంది. కానీ యిప్పటి పరిస్థితులేం బాగాలేవు" అంది. కుటుంబ ఆర్థికస్థితి మా పెలావున్నా యింట్లో ఆడదిక్కు వుండదనే ఆమె బెంగ.

'అన్నట్టు నీకో కొత్త వ్యక్తిని పరిచయం చేయాలనుకుంటున్నాను వర్ధనీ రేపు శనివారం మధ్యాహ్నం నువ్వొస్తావుగా"

ఆ కొత్త వ్యక్తి ఎవరో వర్ధని గ్రహించకపోలేదు ఆ క్షణం కోసమే ఎదురు చూస్తోంది.

"యేం వస్తావా"

*జరిగినకథ: 10* చదువుకుని ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకోవాలనే వుద్దేశ్యంతో విశాఖపట్నం వచ్చిన వర్ధనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సాహం లభిస్తుంది. వర్ధని అన్న ప్రసాద్ చిరుద్యోగి. స్నేహితుడు రజనీకాంత్‌ని వర్ధనికి పరిచయం చేస్తాడు ప్రసాద్. వర్ధని మెట్రిక్ పాసవుతుంది. వర్ధని తల్లి మాణిక్యమ్మగారు మరణిస్తారు. వర్ధనీ రజనీకాంత్‌లు వివాహం చేసుకోవాలనుకుంటారు. సుందరిచే మోసగించబడ్డ ఆనందరావుకి అతనంటే ఇష్టపడే రాణిగురించి చెప్తుంది వర్ధని. ప్రయివేట్‌గా చదివి ఇంటర్ పాసయిన వర్ధని వుద్యోగంలో చేరుతుంది. స్కూటర్ ప్రమాదంలో గాయపడ్తాడు రజనీకాంత్. తనకోసం వచ్చిన సుందరి చెరచబడిందని తెలుసుకుంటుంది వర్ధని రాణిని వివాహం చేసుకుంటాడు ఆనందరావు.

"మీరు రమ్మంటే ఎప్పుడు రాలేదు గనుక?"

సంధ్యలోని సోయగాన్ని చూస్తూ యిద్దరూ నడిచారు.

కొండ, కోన, లోయ తారతమ్యం లేకుండా అన్నింటినీ స్పర్శించి స్పందింపజేసింది చల్లని గాలి.

* * *

"అక్కయ్యా నీకోసం ఎవరోవచ్చారు" అంటూ వచ్చి చెప్పాడు వాసు. వీధిలోకి తొంగిచూసి "మీరా మాష్టారూ. రండి రండి" అని లోనికి ఆహ్వానించింది వర్ధని.

సుబ్బయ్య మాష్టారు కుర్చీలో కూర్చుని. "నువ్వు రేపొచ్చి జాయినవ్వచ్చునమ్మా — అయితే ఒక్కయిబ్బంది వుంది. ప్రస్తుతానికి ఒక్క పీరియడే నీకు కేటాయించారు. అరవై రూపాయలకంటే ఎక్కువ కూడ యివ్వరు." అన్నారాయన.

"థాంక్సు మాష్టారూ—నాకు ప్రస్తుతం కావాల్సింది కాలక్షేపం. నాగురించి మీరు శ్రమతీసుకున్నారు." అంది సంతృప్తిగా.

ఉద్యోగంకోసం వర్ధని ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళినపుడు లక్కడ కన్పించి పలకరించారు సుబ్బయ్య మాష్టారు — ఆయనకీ కుటుంబంతో పరిచయముంది - రిటైరైనాక కొడుకు దగ్గర చేరినా ఖాళీగా కూర్చునే అలవాటు లేక ట్యుటోరియల్ కాలేజీలో చేరారాయన.

వర్ధని కాఫీతెచ్చి యిచ్చింది అందరిగురించి పేరు పేరునా అడిగి తెల్సుకుని వెళ్ళిపోయారాయన.

వీధిగుమ్మంలో నిల్చుని సంతృప్తిగా వూపిరి పీల్చుకుంది వర్ధని. ఈమధ్య ఇంట్లో పాతుకుపోవడం వల్ల వేరే ఆలోచనలేవీ లేకుండా పోయాయి. మనసునిండా దిగులు పేరుకుపోయింది ఒకవిధంగా యిది కాలక్షేపం.

ఉపాధ్యాయవృత్తి తనకు బాగా నచ్చిన వృత్తి. అందుకే అక్కడ ఖాళీలు ఉన్నాయని తెల్సి అప్లికేషను పెట్టింది. మొదట ఇంటి పేరును చూసి ఆశ్చర్యపోయారు సుబ్బయ్య మాష్టారు — ఆ తర్వాత పక్కకుపిల్చి, అన్ని విషయాలూ కనుక్కుని, 'నీకు వచ్చేలా నా సాయశక్తులా ప్రయత్నం చేస్తానమ్మా' అని ఎడ్రసు తీసుకున్నారాయన.

వర్ధని దృష్టి చటుక్కున ఆ మేడపైకి పోయింది — తననుచూసి పిల్లిలా వెనక్కు


PERFUMED
Lure
ALMOND HAIR OIL

పోతున్నాడతను. అంతకు మునుపు తనకోసం కళ్ళింతలు చేసుకునే పెద్దమనిషి ఇప్పు డెందు కిలా చేస్తున్నాడో అర్థం కాలేదు

వంటపనంతా ముగించుకుని స్నానంచేసి ఓ పుస్తకాన్ని తీసుకుని కుర్చీలో కూర్చుంది. ఓటీ వుంటుందని ముందుగానే చెప్పివెళ్ళాడు ప్రసాద్. వాసు, క్రిష్ణకూడా బైటకు వెళ్ళారు పుస్తకం చదువుతున్నదన్న మాటే గాని మనసు పూర్తిగా దానిపై నిలవటంలేదు వర్ధనికి.

విద్య నిగూఢగుప్తమగు విత్తమురూపం— నిజమే—తాతగారి మాటపై మామయ్యకూడా వూరుకున్నట్లయితే తనేమయ్యేదీ తనంతట



తాను ఓ వుద్యోగం సంపాదించుకునే స్థితి కొచ్చేదా?

వీధితలుపు చప్పుడైతే చటుక్కున లేచి వెళ్ళిందల్లా ఒక్కక్షణం ఆగింది — తమ్ముళ్ళయితే 'అక్కా' అని పిలుస్తారుగాని తలుపు తట్టరు. ప్రసాద్ కూడా పేరుపెట్టే పిలుస్తాడు—మరి యీ కొత్తవ్యక్తి ఎవరు?

సుందరికలా జరిగిందగ్గరనుంచీ వంటరితనం తనని భయపెట్టని నిముషం లేదు—తన జాగ్రత్తలో తనుండి తలుపుతీసింది.

సుమ్మందాటి లోనికి అడుగు పెట్టిన వ్యక్తివంక చూసి అచేతనంగా నిలబడి పోయింది - ఆజానుబాహుడైన లతనికి యేభై యేళ్ళుకూడా వుండవేమో! తెల్లని ఖద్దరుపంచ, లాల్చీ వేసుకున్నాడు— పైమీద ఖండువా వుంది ఆయన కళ్ళు తననే పరికిస్తున్నాయి ఆకళ్ళలో ఆశ, సంతృప్తి, అభిమానం, గంభీరమైన ఆ మీసాల కింద పెదాలు వణకుతున్నాయి — సగం వరకూ ఎత్తిన రెండుచేతులూ ఆగాయి

వర్ధని గుండెలు కొట్టుకున్నాయి — ఆనందం, బాధ ఒక్కసారి రగుల్కొన్న గొంతుతో "నాన్నా" అంది—

"అ...మ్మా...వర్ధనీ..." ఆ కంఠంలో— బాధతో కూడిన వణుకు — అతని కళ్ళు వర్షించాయి—

"నేనింకా గుర్తున్నానా అమ్మా"

ఆమె కళ్ళు తుడుచుకుంది.

'అలా కూర్చోనాన్నా' కుర్చీచూపించి దగ్గరగా చాపపై కూర్చుంది-

"ఈ నాన్నమీద యింకా అభిమానాన్ని పెంచుకున్నావా తల్లీ— పాపాత్ముడిని — కన్న పిల్లల బాగోగుల్నికూడా చూడకుండా గడిపిన యీ జీవితంలో యేం సాధించాను చివరికి? అమ్మా నిన్ను చూస్తూంటే నాకెంత ఆనందంగా వుందో తెల్సామ్మా—ఈ క్షణంలో నేను పోయినా ఫర్వాలేదు."

"అమ్మపోయింది తెల్సానాన్నా"

"తెలుసమ్మా తెలుసు. ఈ వ్యామోహాల మాయలో నాకళ్ళు నేనే పొడుచుకున్నానమ్మా"

గాజుగ్లాసులో పాలుపోసి పంచదారవేసి తీసుకొచ్చి యిచ్చింది. తండ్రిలోని మార్పు నామె గమనించక పోలేదు! మనిషి కొంచెం వడిలి వున్నాడు. తను చేసిన తప్పుల్ని నెమరు వేసుకునే స్థితికి వచ్చాడు. పశ్చాత్తాపం మనిషిని మనీషిగా మారుస్తుందిట.

తండ్రినిలా మళ్ళీ చూస్తాం దనుకోలేదామె-వర్ధనికి గుర్తున్నంతవరకూ రంగారావు తెల్లని కమీజు తెల్లని ఫేంటూ వేసుకునే వాడు. బొద్దుగా పెరిగిన మిసాలు, కమీజు గుండీలకు బంగారపు గొలుసు వుండేది. చేతికి రిస్టువాచీ, జేబులో బరువైన పర్సూ—

ఇప్పుడాతనిలో అవేం కన్పించలేదామెకు — మనిషిలో, వేషంలో కూడ మార్పు కన్పిస్తోంది—

"ఎక్కడుంటున్నారు నాన్నా" అడిగింది—

అప్పట్లో అతనికో వూరంటూ వుండేది కాదు — గుర్రప్పందాలూ, క్లబ్బులూ, వూరూరా డబ్బుగల స్నేహితులూ—

"మనిషిగా మారాక ఇక్కడే వుంటున్నానమ్మా— జీవితం చివరి భాగంలో నయినా నా పొట్ట నేను పోషించుకోవాలనే వుద్దేశ్యంతో యిక్కడే స్థిరపడ్డానమ్మా."

"అదేమిటి నాన్నా మేమంతా లేమూ?"

"నువ్వామాట అంటావని నాకు తెలుసమ్మా. అందుకే యిన్నాళ్ళూ మీకు ముఖం చూపలేక పోయింది. అన్నయ్యనూ, తమ్ముళ్ళనూ పలకరించకపోయినా కళ్ళతోనైనా చూసుకున్నాను. నీకోసమే యీరోజిలా వచ్చానమ్మా. నిన్ను చూడాలని పరితపించే నా మనసును సమాధానపరచుకోలేకనే వచ్చానమ్మా. అయితే తల్లీ, నాకోమాట యివ్వగలవా?"

"యేవిటి నాన్నా అది?"

"నన్ను చూసినట్టూ నీ వెవరితోనూ చెప్పకూడదమ్మా."

"అదేవిటి నాన్నా!"

"అవునమ్మా. నేనెటూ మీకు పెట్ట

లేనివాడినే. హాయిగా బ్రతికే మీరు కూడా నావల్ల... ...''

''హాయిగా బ్రతుకుతున్నా మనుకుంటున్నారా నాన్నా. కంటికిరెప్పలా చూసుకునే అమ్మ పోయింది. మీ అభిమానం దూరమైంది. ఒకరి జాలి, సానుభూతితో యిన్నాళ్ళూ బ్రతికాం. ఇంకా అలాగే వుండాలా నాన్నా. యేమైనాసరె మీరు మమ్మల్ని విడిచి వెళ్ళడానికి వీల్లేదు ''

క్షణంసేపు అతనేం మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా అన్నాడు.

''నాకు మా తం నా బిడ్డలదగ్గర వుండాలని వుండదామ్మా. కొన్నాళ్ళు మాత్రం నా యిష్టానికి, నా మాటకు విలువ యివ్వాలమ్మా నువ్వు''

ఆమె యేం మాటాడలేకపోయింది—

''మీ యిష్టం నాన్నా' అంది చివరికి.

*   *   *

గదిలో కోడిగుడ్డు దీపం సన్నని వెలుగుని నాలుగు మూలలకూ పంచిపెడుతూంది. దీపం చుట్టూ చేరి ఆవెలుగుకే ఉబ్బితబ్బిబ్బై దిక్కుమాలిన సంతోషంతో దాని చుట్టూనే తిరుగుతున్నాయి చిన్ని చిన్ని పురుగులు.

వర్ధనికి నిద్ర రావటంలేదు. ఆ పురుగుల్ని చూస్తుంటే ఆమెకేదో నగ్నసత్యం గోచరమైనట్లయింది.

ఎవరి జీవితం వారి చేతుల్లోనే వుంటుంది. ఎవరో ఆడిస్తున్నారని మనం ఆడుతున్నామనీ అనుకోవడం పొరపాటు. జీవితంలో వూహతెల్సింది మొదలు ఆశలు పుడతాయి. కోర్కెలు రగులుతాయి. వయసు పెరిగేకొద్దీ ఆశయసిద్ధికోసం ఆరాటం తప్పదు. పట్టుదలతో కొందరు కృతకృత్యులవుతారు. కొందరు దీపపు పురుగులలానే అందులోనే అంతవౌతారు.

జరిగిన సంఘటనలన్నీ ఆమె కొక్కసారి గుర్తొచ్చాయి. ఈ అసంపూర్తి జీవితాలెలా పరిణమిస్తాయో అనుకుంది.

కిటికీలోంచి బైటకు చూస్తే పుచ్చపువ్వులా వెన్నెల విరిగిపడుతోంది. ఆకాశం మీద మబ్బులు ఒకదానివెంట మరొకటి జీవితంలోని సంఘటనల్లా జరుగుతూ పోతూనే వున్నాయి.

మధ్యాహ్నం మూడు కానిచ్చి బయల్దేరింది అనుకోవడమేగాని పెళ్లయ్యాక రాణి దగ్గరకు వెళ్ళలేకపోయింది. తీరా వీలుచూసుకుని వెళితే తలుపుకు తాళం - మళ్లీ వెనక్కు రాలేక అట్నించటే స్కూలుకు వెళ్లొచ్చునని రజనికాంత్ యింటికి వెళ్లి తలుపు తట్టింది.

తలుపు తీసిన అమ్మాయివైపు ఆశ్చర్యంగా చూసి నిలబడిపోయింది.

''మీరు వర్ధనా — రండి లోపలకు'' అంటూ ఎంతో చనువున్న దానిలా పలకరించి.

'నా పేరు కవిత' అందా అమ్మాయి.

లోపల రజనీకాంత్ వున్నట్టులేదు — రామయ్య జాడకూడలేదు ''కవితంటే యీ మేనన్నమాట !'' అనుకుంది మనసులోనే.

పొట్టిగా చామన ఛాయగా నాజూగ్గా వుంది. ఆ అమ్మాయి కళ్లలో మాత్రం యేదో ఓ వింత వెలుగు కన్పిస్తోంది. మాటలో సరళత గోచరిస్తోంది.

''అన్నయ్య నిన్ననే చెప్పారు మీ గురించి. అనుకున్న దానికంటె ఓ రెండు రోజులు ముందు రావటం వల్లనేయేమో మనం యిలా కల్సుకున్నాం'' అని లోపలకువెళ్ళి రెండు నిముషాల్లో తిరిగివచ్చింది.

వర్ధనికేం అర్థంకాలేదు కవిత ఎవరా అని ఆలోచించిందేగాని రజనీకాంత్ నామె అడగలేదు. మాటల సందర్భంలో కూడ తనకో చెల్లెలున్నట్లు అతను చెప్పనూ లేదు:

కాఫీ తెచ్చియిచ్చింది కవిత మనిషిలోని నేర్పును కనిపెట్టడానికి ఎంత సేపు కావాలి ? మునుపటికంటె యిల్లు చాల నీటుగా సర్ది వుంది. కవితను మనసులోనైనా మెచ్చుకోకుండా వుండలేకపోయింది

## 23

అవి నేను డిగ్రీచదివే రోజులు హాస్టల్లో వుంటు చదువుకునేవాడిని నాకు దగ్గర మిత్రులు ఒకరిద్దరే కానీ నాకు నచ్చినవ్యక్తి ఒక్కడే ఒకడు అతను అప్పలస్వామి. అప్పలస్వామి నాతో చదువుకునేవాడు కాదు. హాస్టలలో పనిచేసే ఓ యాభైయ్యేళ్ళ ముసలివాడు నిస్వార్థజీవి, నమ్మకస్తుడు హాస్టల్లో ఎవరికే అవసరమొచ్చినా అప్పలస్వామి పేరు వినబడేది. పనిచేసేవాడుగా కాక కావల్సిన బంధువుగా అవసరాలు తీర్చేవాడు.

అప్పలస్వామితో కూడా ఓ అమ్మాయి వచ్చేది. అప్పటికా పిల్లవయసు యేడెనిమిది. సంవత్సరాలకు మించదు. అతనికి అన్ని పనుల్లోనూ సాయపడుతూ బొంగరంలా తిరుగుతూ చేస్తూండేది.

ఆపిల్లను కంటికి రెప్పలా చూసుకునేవాడు అప్పలస్వామి. కారణం అతని కామె తప్పితే మరో దిక్కులేదు. అటువంటిది, అప్పలస్వామి కన్నుమూసేసరికి ఆమె కు పదేళ్ళు నిండివుంటాయి. ఆ వయసులోనే అనాధగా మిగిలిపోయిన ఆ అమ్మాయి బ్రతుకు భారాన్ని నేను వహించాలనుకోటానికి కేవలం జాలే కాకుండా మరోటి కూడా వుంది— అప్పలస్వామి మంచం పట్టాడని తెల్సి వెళ్తే నేను వచ్చానని ఆనందంతో కళ్ళనీరు పెట్టుకుని ఆ పసిదాని జీవితం బండరాళ్ళ పాలపడకుండా కొన్నాళ్ళైనా చూడమని అడగలేక అడగలేక అడిగాడు నేను పెరిగిన పరిస్థితులే జ్ఞాపకాలుగా కళ్లముందు నిల్చి ఆబాధ్యతను స్వీకరించేందుకు పునాదులయ్యాయి.

ఆ అమ్మాయికి నేను పెట్టుకున్న పేరు కవిత ! రజనీకాంత్ ఆగాడు. అతని మాటలు వింటూ అతనివంకే చూస్తుంది వర్ధని. ఆమె కళ్ళలో లీలగా మెరిసింది కన్నీరు. ఈ ప్రపంచంలో తెల్లారితే కొన్ని వేలమంది అనాథలు తెగిన గాలిపటాల్లా గాలివాటుకు

## కుదుపు

డా॥ దాశరథి

గాఢ నిద్రలో వున్నవారి
కళ్ళు తెరిపించే కుదుపు

సోమరితనం ప్రబలినవారి
శోణితం వేడెక్కించే కుదుపు

అభ్యుదయ శక్తులన్నిటినీ
ఐక్యపరిచే కుదుపు

ఈ అనివార్యమైన కుదుపు
హేయశక్తులకు అదుపు

కాలాన్ని వెనక్కి తిప్పాలనే వారి యెడ
కడు జాగ్రత్తగా వుండమని పిలుపు

మారణహోమాన్ని నిరసించే
మహా ప్రజావళికి ఇది గెలుపు

కొట్టుకు పోతున్నారు. అటువంటి వారిని ఆదుకునేశక్తి, బుద్ధి ఎందరి కుంటుంది ? వున్నా ఎంతవరకు ఆదుకోగలరు ? నిజంగా రజనీకాంత్ మహోన్నతమైన వ్యక్తి, అనుకుంది వర్ధని. భవిష్యత్ అంటే యేమిటో తెలియని అగాధ అబలను చేరదీసి సంస్కరించి కొత్త జీవితాన్ని ప్రసాదించాడు—

అప్పుడే చీకటి తెరలు లోకం మీదికి దిగజారుతున్నాయి.

ఇద్దరూ లేవారు. చంద్రుడికాంతి సముద్రపు నీటిమీదపడి వెండిలా మెరుస్తోంది. అవిరామంగా అలలులేచి పడుతూనే వున్నాయి.

ఒకరోజు ప్రసాద్ వర్ధనిని ఆశ్చర్యంగా అడిగాడు.

“రజనీకాంత్ అన్నది నిజమేనా” అని— మొగ్గలు తొడిగిన సిగ్గుతో నవ్వి తలొంచుకుంది—

“దీనికి మామయ్య అభ్యంతరం వుండదనుకుంటానమ్మా. ఆయనకీ శాఖలు పట్టింపులు లేవు. పోతే- తాతయ్య సంగతే ఆలోచించాలి. ఇప్పటికే మనపై పీకలదాకా కోపముంది. ఇక యీపాటి పెద్దరికం నిలబెట్టకపోతే...” మధ్యలోనే ఆగిపోయాడు. కాస్సేపాగి వర్ధనే అంది “ఇంతకీ ఆయన విషయంలోని అభిప్రాయమేమిటన్నయ్యా”

“మంచివాడేనమ్మా. ఇంతకీ నీ యిష్టాన్ని కాదనే శక్తి వుందా మాకు? ఎన్ని అవాంతరాలున్నా నీ పెళ్లి జరిపించే బాధ్యత నాది”

వర్ధని మనసంతా సంతోషంతో నిండి



చదువులో ఏముందిరా సన్నాసి అంటే ఇన్నాళ్ళుగాదు బతకాలంటే నావెంటరా ...

# సాగవీచికలు

పోయింది ఆ సమయంలో తండ్రి గుర్తుకొచ్చాడామెకు ఆయనకు కూడా ఈవిషయం తెలియపర్చే బాధ్యత తనదేమరి ! కానీ...?

* * *

కల్చరల్ వీక్సు జరుగుతున్నాయి. ఆ రోజే ఆఖరిరోజు. కళామందిరమంతా కళకళలాడుతోంది. మరొక్క పదినిముషాల్లో ప్రదర్శన మొదలవుతుంది. ఆ రోజు ప్రదర్శింపబడేది రజనీకాంత్ వ్రాసిన 'మరో హిమాలయం' నాటిక. ముందువరుసలో ముఖ్యమైనవ్యక్తులు కూర్చున్నారు. ఆ ప్రదర్శనకు జడ్జీలుగా నియమింపబడ్డ మేటి నాటక రచయిత శాస్త్రిగారు, కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన 'అరుంధతి' గారు, స్టేజి డైరెక్టర్ రావుగారు—

రెండవ వరుసలో రజనీకాంత్ వున్నాడు. అతనికి ఎడమ పక్క కవిత, కుడివైపున వర్ధని కూర్చున్నారు. వర్ధని ప్రక్కనే ప్రసాద్ కూర్చున్నాడు.

ఇంతలో నిలబడివున్న మనుషుల్ని తప్పించుకుని ఓ వ్యక్తి రజనీకాంత్ దగ్గరకు వచ్చి, 'సార్ ఒక్కసారి' అని పిలిచాడు నెమ్మదిగా. వర్ధని దృష్టి ఆ వచ్చిన వ్యక్తిపై పడింది. ఆమె భృకుటి ముడి పడింది. వర్ధనిని చూసిన అతగాడి ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు.

రజనీకాంత్ అతనిని అనుసరించి అయిదు నిముషాల్లో తిరిగి వచ్చాడు నవ్వుతూ.

వర్ధని మనసుపై ఆవహించిన మబ్బు తెరలు ప్రదర్శన ప్రారంభమయ్యేసరికి సర్దుకున్నాయి అనుకున్నదానికంటె రసవత్తరంగా నడిచి పూర్తయింది నాటిక. నవసమాజ నిర్మాణానికి యిటువంటి ప్రదర్శనల అవసరం ఎంతైనా వుందన్నారు చాలమంది. ఉత్తమ రచనకు రజనీకాంత్ బహుమతి నందుకున్నాడు.

ఇంటికి వచ్చాక జరిగిన సంగతులన్నీ నెమరువేసుకుంటే ఓ కొత్త సంగతి వర్ధని మనసు నాకర్షించింది. ఆడవాళ్లంటేనే సిగ్గుపడే ప్రసాద్ కవితతో ఎంతో చనువుగామాట్లాడాడు అలా మాట్లాడేటప్పుడు అమితమైన ఆనందం అతని కన్నుల్లో గోచరమయ్యింది.

ఆ మర్నాడు ఉదయమనగా వెళ్లిన వాసు పన్నెండు గంటల ప్రాంతంలో తిరిగొచ్చాడు. అతని ముఖం విప్పారివుంది. సంగతేమిటంటె అతగాడికి ఓ ప్రైవేట్ కంపెనీలో వుద్యోగమొచ్చింది వర్ధని మొదట ఆశ్చర్యపోయింది. ఎంత ప్రైవేటు కంపెనీ అయినా డబ్బూ పలుకుబడీలేకుండా ముఖంచూసి సర్టిఫికేట్లు చూసిఉద్యోగమెవరిచ్చారో ఆమె కర్థం కాలేదు. ఆ సంగతె అడిగితే వాసు అసలు విషయాన్ని చెప్పాడు.

“నాలుగు రోజుల క్రితం నేను ఎంప్లాయిమెంటాఫీసుకు వెళ్లి కనుక్కుంటే పోస్టుకు పంపే అభ్యర్థుల జాబితా అప్పుడే తయారయిపోయిందని చెప్పి నిరాశపడి వస్తున్నాను. ఇంతలో ఒకాయన నన్ను పిల్చి నా వివరాలు కనుక్కొని యేపనైనా చెయ్యగలవా అని అడిగారు. నేను జంకకుండా ఓ యస్ అన్నా. అతనో అడ్రస్ నా చేతికిచ్చి యీ రోజు వచ్చి కలియమన్నారు. నిజంగా వస్తుందన్న నమ్మకం లేకనే ముందుగా యీ విషయం నీతో చెప్పలేదక్కా.”

“ఇంతకీ ఎవర్రా ఆయన. మన తాతయ్యకు గాని మామయ్యకుగాని తెల్సినాయనేమిటి ?”

కుటుంబ విషయాలేం అడగలేదని వాసు చెప్పడంతో అక్కడి కా ప్రసక్తి ఆగిపోయింది

ఆ రోజు సాయంత్రం స్కూలు నుండి త్వరగా వచ్చేసింది వర్ధని.

వంటరిగా కూర్చున్నకొద్దీ ఆలోచనలామె మనసుకు అశాంతిని కలిగిస్తూనే వున్నాయి. ఆనందరావుకి ట్రాన్స్‌ఫర్ వస్తుందేమోనని అనుకుంటున్నారు.

ఎందుకో ఓసారి రాణిని చూసివద్దామని అన్పించి లేచి బయలుదేరింది. కాస్త దూరం వెళ్లి ఎవరో తనను వెంబడిస్తున్నట్టై వెనుదిరిగి చూసి ఆశ్చర్యపోయింది. అతను గిరి !

“క్షమించాలి. మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి” తలొంచుకునే అన్నాడు. అతని చూపుల్లో మరోభావం కన్పించలేదామెకు.

“ముఖ్యమైన విషయాలు మాట్లాడ్డానికి యిది అనువైన చోటు కాదేమో” కాస్త గట్టిగానే అంది.

(ఇంకావుంది)

వేళకు విధులకు హాజరవడం
క్రమశిక్షణలో మొదటి మెట్టు




"సీతాలు లేసిపోయిందిగా !"

పేరిగాడి మాటలు విని ఉలిక్కిపడ్డాడు సింహాచలం.

"నీకేమన్నా మతిసెలించిందా?" అంటూ నులకమంచంమీద లేచికూర్చున్నాడు.

"బలేవోడివి మావా ! ఏం తెలియనట్టు మాటాడుతుండావే?" నిష్ఠూరంగా పల్కాడు పేరిగాడు.

"నిజంరా ! నాకేమీ తెలవదు !"

"ఇంటిపక్కనున్నోడికి తెలవదంటే ఎవరు నమ్ముతారు మావా ?"

"ఈ యిసయం నువ్వు చెప్పేదాకా నాకు తెలవదురా ! సత్తెపెమాణకంగా ! నిన్న మద్దానేళ నాకు వన్నంలో సేపల పులుసు వేసుకోమని యిచ్చింది కూడా ! రేతిరి ఆలెస్సంగా రావటంచేత పలకరించటానికి యీాలు కుదరలేదురా !" బాధగా పల్కాడు సింహాచలం.

"బహుశా నువ్వొచ్చేటప్పటికే యెళ్లిపోయుంటాది" ఊహించి చెప్పాడు పేరిగాడు.

సీతాలు అంతపని చేస్తుందని సింహాచలం ఏప్పుడూ ఊహించలేదు. ఆమె తత్వం అతనికి బాగాతెల్సు ! రోజూ తప్పతాగి యింటికి వచ్చే మొగుడుపెట్టే బాధలన్నింటినీ, సింహాచలానికి చెప్పుకొని 'నాబతుకిలా తగలబడింది తాతా !' అని కన్నీరు కార్చేది. పెళ్లాన్ని చిత్రహింసలుపెట్టే సైదులును సింహాచలం చినాట్లు వేసెవాడు. కాని సైదులు ఏపీ లక్ష్యపెట్టేవాడుకాదు.

'మగాడు తాగుతాడు. తిరుగుతాడు. ఇంకా ఎన్నో సేత్తాడు. అయన్నీ నిలదీసి అడిగేటి అధికారం ఆడదాని కెవడిచ్చాడు మావా ?' అని ఎదురు ప్రశ్న వేసేవాడు. ఒక్కోసారి సింహాచలం కళ్ళముందే, సీతాలును దెబ్బలు కొట్టేవాడు. ఆదృశ్యం చూస్తుంటే సింహాచలం గుండె తరుక్కుపోయేది. 'ఆడకూతుర్ని కొట్టడానికి ఆడికి సేతులెలా పత్తున్నాయి !' అని మనస్సులోనే బాధపడేవాడు

"ఇంకా యేటిమావా, ఆలోసిత్తుండావ్ ! ఆడ సైదులుగాడు ఉస్సూరుమంటూ కూకున్నాడు. మనోళ్లంతా ఆడిదగ్గరే వున్నారు. యెళ్దాంరా !" అంటూ పేరిగాడు పరధ్యానంగా వున్న సింహాచలాన్ని వెంటబెట్టుకు వెళ్లాడు.

సింహాచాలాన్ని చూడగానే సైదులు బావురుమన్నాడు.

"సిమ్మాచెలంమావా ! సీతాలు నా కొంప ముంచేసినాది ! నన్ను అన్నాయంచేసి యెళ్లిపోయింద్రోయ్ !"

సైదులు పరిస్థితి చూస్తుంటే సింహాచలానికి జాలికల్గింది. పెళ్లామంటే ఎంతో ప్రేమవున్నట్లు మాట్లాడుతున్న సైదులు మాటలు సింహాచలాన్ని ఆశ్చర్యపర్చాయి. అతను చేస్తున్నదంతా నటనేనని, సీతాలంటే అతని కసలు ప్రేమలేదన్న విషయం సింహాచలానికి తెల్సు. మొగుడు రిక్షాబండిమీద సంపాదించినదంతా అతని తాగుడికి, జల్సాలకు సరిపోతుందన్న విషయాన్ని గ్రహించి సీతాలుకూడా ఓఫ్యాక్టరీలో కూలీగా చేరింది. ఆమె కూలీగా చేరిన దగ్గర్నుంచీ సైదులు జల్సాలు మరింత పెరిగిపోయాయి. భార్య సంపాదనకూడా అతని సరదాలకు హారతి కర్పూరమైంది. మొగుడికి భయపడి అడిగినప్పుడల్లా లేదనకుండా డబ్బులిచ్చేది అయినా ఒంటిమీద దెబ్బలు మామూలే!

"మావా! యేళ్లేటప్పుడు నీకేమైనా సెప్పిందా?" ఆత్రంగా అడిగాడు సైదులు.

"అసలు అది యెళ్లిపోయిన యిసయం పేరిగాడు సెప్పేవరకు నాకు తెలవదురా! నేను వొచ్చేసరికి సానా రేతిరయింది" అన్నాడు సింహాచలం.

"ఇలా జరుగుతుందని ఏనాడూ అనుకోలేదు మావా!" అంటూ సైదులు సింహాచలాన్ని కౌగలించుకుని చిన్న పిల్లవాడిలా ఏడ్చాడు. అతన్ని ఎలా ఓదార్చాలో సింహాచలానికి అర్థం కాలేదు. కాని అక్కడకు చేరినవారంతా తలో మాట అని సైదులును ఓదార్చడానికి ప్రయత్నించారు,

"ఇంకా నయం! పిల్లా జెల్లా లేరు కాబట్టి సరిపోయింది" అన్నాడు ఏడుగురు పిల్లలను కన్న తండ్రి.

"కోపం వచ్చి మొగుడు ఓ దెబ్బ యేస్తే తప్పా? ఆమాత్తరం ఓర్చుకోలేదా పెళ్లామన్నది" అన్నాడు పెళ్లాం అడుగుజాడల్లో నడిచే ఓ మొగుడు.

"పిదపకాలం! పిదప బుద్ధులు! ఎంతైనా ఆడదాని కింత తెగింపు పనికిరాదు" అంది ఆరేళ్ల క్రితం మొగుణ్ణి వదిలేసి వచ్చిన ఓ యిల్లాలు.

"ఆఁ... లదెక్కడికి పోతుందిలే! కొత్త మోజు తీరాక అదే పరిగెత్తు కొస్తాది" అన్నాడు నాలుగో పెళ్లాం కోసం గాలిస్తున్న ఏభయేళ్ల వడుచువాడు.

"తీసికెళ్ళినంత మాత్రాన ఆ యెంకటాచలం దీన్ని మనువాడతాడేమిటి?" అంటూ సందేహాన్ని వెలిబుచ్చింది పెళ్లి కాకుండానే అబ్బాయిని కన్న ఓ కన్నతల్లి.

రోడ్డుమీద కౌన్సిలర్‌గారు కన్పించగానే అందరూ ఠక్కున నోళ్లు మూశారు. కూర్చున్నవాళ్లంతా నిలబడ్డారు. కొంతమంది ఆయనకు ఎదురు వెళ్లారు. ఎలక్షన్ల అయ్యాక కౌన్సిలర్‌గారు ఈ గూడెంలోకి అడుగు పెట్టడం యిది నాల్గోసారి. మొట్టమొదటిసారిగాదండలతో వూరేగుతూవచ్చారు. అప్పుడు వచ్చారన్న మాటేకాని గూడెంలోని వాళ్ళతో మాట్లాడటానికి ఆయనకు టైమ్ దొరకలేదు రెండోసారి టైమంతా ఆ రోడ్డు కంట్రాక్ట్ చేస్తున్న వ్యక్తికిరోడ్డు ఎలా వేయించాలో చెప్పటానికే సరిపోయింది. ఎందుకంటె ఆ కంట్రాక్టర్ అతని సహోదరుడే! మూడోసారి వచ్చినప్పుడు మాత్రం గూడెంలోని వాళ్లను పల్కరించాడు. తను ఆ గూడెంకు ఎంతో సహాయం చేసే వుద్దేశంతో వున్నట్లు, అందుకు అందరి సహకారం అవసరమని వుపన్యాసం చెప్పాడు. తను రాబోయే ఎలక్షన్లలో నెగ్గితే తప్పకుండా గూడెంకు నీటి కొళాయిలు ఏర్పాటు చేస్తానని చెప్పాడు. అంతేకాదు కంకరరోడ్డు కూడా వేయిస్తానన్నాడు. ఆయనగారి మాటలకు, చేతలకు ఎన్ని కిలోమీటర్ల దూరంవుంటుందో ఆ గూడెంలోని వాళ్లందరకూ తెల్సు! ఎందుకంటే గత పదేళ్ల నుండి పోటీ లేకుండా ఆ వార్డు నుంచి ఎన్నిక అవుతున్నాడతను. ఇప్పుడిప్పుడే అతనికి పోటీగా ఎవరైనా పోటీగా నిలబడితే బాగుంటుందనే అభిప్రాయం గూడెంలోని చాలామంది మనస్సుల్లో కల్గ సాగింది. ఆ విషయం తెల్సినవాడు కావటం చేతనే నాల్గోసారి గూడెంలోకి వచ్చాడు. సైదులును పల్కరించటానికి. సైదులును చేతిలో పెట్టుకొంటే గెలుపు ఖాయమన్న విషయం ఆ రాజకీయ చతురునికి ఎవ్వరూ చెప్పనక్కర్లేదు.

"ఏరా సైదులూ! నేవిన్నది నిజమేనా?" అంటూ సైదుల్ని పల్కరించారు కౌన్సిలర్ గారు.

సైదులు గడగడలాడుతూ "నిజమే నయ్యగారూ! నా కన్నాయం జరిగిపోనాది" అన్నాడు.

"చక్కగా సంపాదించిపెట్టే మొగుడుండగా దానికేం రోగంరా?" చిరాకుగా అన్నారు కౌన్సిలర్‌గారు.

"తోండ తాగొచ్చి అప్పుడప్పుడు సిన్నగా కొట్టేవాణ్ణి దొరా! కాని ఈ మధ్యసలు దాని వొంటిమీద సెయ్యే ఏయటం లేదయ్యా! దానికేం కట్టమొచ్చి యిలాంటిపని చేసింది?" తనదేమీ తప్పు లేదన్నట్లుగా మాట్లాడేడు సైదులు.

**విచికిత్స**

హేతువాదం పెరుగుతోంది
ఈమాత్రం ఒళ్లెరగవా అని.
వేదసారం అడుగుతోంది,
ఆ మాత్రం ఎఱుక లేదా అని.
మానవత్వం నలుగుతోంది,
ఏమాత్రవేసుకుంటే ఏమో అని!

**— అవసరాల రామకృష్ణారావు**

కౌన్సిలర్‌గారు వెంటనే అందుకొని "ఒళ్లు పొగరెక్కి చేసే పన్లురా యివి! అణిగి మణిగి వుండాల్సింది పోయి ఎంతకు తెగించింది? మొగుడంటే భయభక్తులు లేకపోయాక యింక అదేం సంసారం చేస్తుందిరా? నువ్వు విచారించకు! ఎవరు తీసుకొన్న గోతిలో వాళ్లే పడ్తారు" అంటూ అప్యాయంగా సైదులు వీపు తట్టారు.

"నాకేంసేయాలో తెలియటంలేదయ్యా" విచారంగా అన్నాడు సైదులు.

"సైదులూ! ఒక విషయం చెప్తున్నాను గుర్తుంచుకో! ఆడది ఎప్పుడూ మగవాడికి లొంగే వుండాలి. అది ధర్మం. అలాకాకుండా మగవాణ్ణి ధిక్కరించి 'నువ్వెంత?' అంటూ బయటకు వెళ్ళిందంటే అది పతనానికి హేతువు. సీతాలు పోయిందని నీవు బాధపడనక్కర్లేదు. అలాంటి నీతిలేని దాంతో కాపురం చేసేదానికంటె ఒంటరి జీవితమే నయం!" అన్నారు కౌన్సిలర్‌గారు చుట్టూ చూస్తూ.

అప్పటిదాకా మౌనంగా వున్న సింహాచలం సైదులు భుజంమీద చేయివేసి "అయ్యగోరు సెప్పేంది నిజమేరా! ఇలా యిచారిస్తూ కూకుంటే పయోజనం వుండదు. జరిగిందేదో జరిగిపోనాది. పోయి నీపని సూసుకో!" అన్నాడు.

"వెళ్లొస్తారా సైదులూ! ధైర్యంగా వుండు!" అనేసి వెళ్లిపోయారు కౌన్సిలర్ గారు. గూడెంలోని కొంతమంది ఆయన వెనకాలే కొంత దూరం వెళ్లి సాగనంపి తిరిగి వచ్చారు.

"నేను కూడా యెళ్లొత్తారా సైదులూ!" అంటూ తుండుగుడ్డ భుజాన వేసుకొన్నాడు సింహాచలం.

"నువ్వుకూడా అప్పుడే యెల్తున్నావా, మావా?" అంటూ దిగులుగా అడిగాడు సైదులు.

"ఇయ్యాల మా సావుకారుగారింట్లో సుబకార్యముంది. ఆరింటికి యియ్యాల పెద్ద పెద్దోళ్లంతా వత్తారంట ఆడ సేయాల్సిన పనులు సానా వున్నాయి. నే వెళ్తాత్తా" అనేసి తన యింటివైపు నడిచేడు సింహాచలం.

మరో అరగంటలో కాలకృత్యాలన్నీ ముగించుకొని షావుకారు గారింటికి బయల్దేరాడు సింహాచలం.

అతనంటె ఆ గూడెంలోని వాళ్లకెంతో అభిమానం. వయస్సులో కూడ అందరికంటె పెద్దవాడు. అందుచేత అక్కడతనికి గౌరవ మర్యాదలకు లోటులేదు కాని వాళ్లందరికీ ఒక్కటే దిగులు. సింహాచలాని 'నా' అనే వాళ్ళు లేకుండా పోయారని! జీవితంలో ఎన్నో కష్టనష్టాలకు గురయ్యాడతను చేతి కందిన కొడుకు కలరావచ్చి దుర్మరణానికి బలి కావటం అతని జీవితంలో తిరుగులేని దెబ్బ. ఆ దెబ్బ నుండి తేరుకోక ముందే భార్య గుండె జబ్బుతో మరణించింది ఎన్ని దెబ్బలు తిన్నా అతని గుండె ధైర్యం చలించలేదు. కాని వయోభారంచేత శక్తిని క్రమేపీ కోల్పోయాడు. అతనికి అంతకాలం జీవనాన్ని కలుగజేసిన రిక్షాను యిక తొక్కలేకపోయాడు. జీవనోపాధికి మార్గాలు వెతుకుతున్న తరుణంలో షావుకారుగారి దగ్గర తోటమాలి ఉద్యోగం దొరికింది సింహాచలానికి

షావుకారుగారు ఆ వూళ్లో పెద్ద వ్యాపారవేత్త. మంచి పలుకుబడి, రాబడి వున్న వ్యక్తి. ఆయన చాల్నాకాలం నుంచి అపురూపంగా పెంచుకొన్న పూలతోటకు సింహాచలాన్ని మాలిని చేశాడు. పేరుకు తోటమాలి అయినా ఆ యింట్లో చిన్న చిన్న పనులు చాలావరకు సింహాచలమే చూస్తుండే వాడు కొద్ది కాలంలోనే యింట్లో వాళ్ల మన్ననలను పొందకల్గాడతను. షావుకారు గారికి సింహాచలమంటే మంచి నమ్మకం ఏర్పడింది.

సింహాచలం వెళ్లేసరికి షావుకారుగారిల్లు చాలా సందడిగా వుంది, గేటు తీసుకొని లోపలికి వస్తున్న సింహాచలాన్ని చూడగానే "సింహాచలం! చీకటితోనే రమ్మన్నానుగా! ఇంత ఆలస్యం చేశావ్?" అని అడిగారు షావుకారుగారు.

"గూడెంలో కొంచెం ఆలెస్సమయిన దండి!" అన్నాడు సింహాచలం తప్పు చేసిన వాడిలా తలవంచుకొని.

"అయితే జరగాల్సిన పనులు చాలా వున్నాయి. నారాయణ, సోములు అంతా పని చేస్తున్నారు. నువ్వుకూడా వెళ్లి సాయం చెయ్" అని చెప్పేసి యింట్లోకి వెళ్లా రాయన. అంతా కల్సి ఆ సాయంత్రానికల్లా షావుకారుగారింటిని ఎంతో అందంగా అలంకరించారు.

రంగులను వెదజల్లే షామియానాలతోను,

# మడిసికో నాయం !

కాంతులను విరజిమ్మే విద్యుద్దీపాలతోను పెళ్లివారి యిల్లులా కళకళ లాడుతోంది. విశాలమైన ఇంటి ప్రాంగణంలో టేబుల్సును, కుర్చీలను చక్కగా అమర్చారు. ఓ ప్రక్కగా ఎత్తయిన వేదికను కూడా ఏర్పాటు చేశారు. ఇంటివెనుక వేసిన పందిట్లో ఆ రోజు విందుకు కావల్సిన పదార్థాలన్నీ శరవేగంతో తయారవు తున్నాయి.

సాయంత్రం ఆరు దాటాక అతిథులు ఒక్కరొక్కరే రావటం ప్రారంభించారు. విలువైన వాహనాలమీద, ఖరీదైన దుస్తులతోను వచ్చే బంధువులను, స్నేహితులను చిరు నవ్వుతో ఆహ్వానించారు షావుకారుగారు.

ప్రొద్దున్నుంచి బాగా పనిచేసి వుండటం చేత బాగా అలిసిపోయిన సింహాచలం తోటలో ఓ ప్రక్కగా కూర్చున్నాడు.

ఆహ్వానితులంతా వచ్చాక ఆవూరి చైర్మన్ వారితోసహా మరికొంతమంది పుర ప్రముఖులు వేదిక నలంకరించారు. అందరూ ఆ నాటి శుభకార్యాన్ని గురించి ముచ్చటిస్తూ, షావు కారుగారి విశాల దృక్పథాన్ని, ఆదర్శ హృద యాన్ని, ఆత్మ ధైర్యాన్ని శ్లాఘించారు.

పరధ్యానంతో ఉపన్యాసాలను ఆలకిస్తున్న సింహాచలం కౌన్సిలర్‌గారి కంఠం విన్పించ గానే రక్కున లేచి నిలబడ్డాడు. ఆయన చెప్పే విషయాలను వినాలనే కుతూహలం అతనిలో అధికమైంది. మెల్లగా అడుగులు వేస్తూ ముందుకు వెళ్లాడు.

కౌన్సిలర్‌గారి కంఠం ఖంగున మ్రోగు తూంది.

"ఈరోజు చాలా సుదినం. శ్రీ శేషావ తారంగారు కేవలం దయార్ద్ర హృదయులు మాత్రమే కాదని, గొప్ప ఆదర్శవాదులుకూడా నని ఈనాడే రుజావుచేసుకుంటున్నారు. ఈ రోజుల్లో ఆదర్శాలు వల్లించటం చాలా తేలిక కాని ఆచరణలో పెట్టడం కష్టసాధ్యం. ఇలాంటి పరిస్థితుల్లో ఆయనగారు తన కుమార్తెకు పునర్వివాహం చేయటానికి నిశ్చయించి ఈరోజు తాంబూలాలు పుచ్చుకో వటం నిజంగా అభినందించాల్సిన విషయం. నిజం చెప్పాలంటే ఆయనగారి కుమార్తె కూడా ఎంతో యోగ్యురాలు. ఆడదంటే అబలకాదని నిరూపించుకొన్న ఆదర్శ మహిళ ఆవిడ. ఆడవారి హక్కుల కోసం, స్వాతంత్ర్యం కోసం భర్తతోనేపోరాడి చివరకు విడాకులిచ్చి విజయాన్ని సాధించిన విజేత ఆవిడ. అసలు ఆడది మగాడికి లొంగి వుండా ల్సిన అవసరం ఏమిటి? తనకు నచ్చినవాడితో సంసారంచేసే హక్కు ఆమెకుంది. ప్రస్తుతం ఈమెను వివాహం చేసుకోబోతున్నయువకుడు సురేష్ కూడా గొప్ప అభ్యుదయ భావాలుగల వ్యక్తి. విశాల హృదయుడు. అందుచేతనే వివాహం కాగానే అల్లుణ్ణి ఫారిన్ పంపించ టానికి ప్రయత్నాలు చేస్తున్నారు షావుకారు గారు. కాబట్టి నేను మీ అందరికీ మనవిచేసే దేమిటంటే శేషావతారంగారి లాంటి విశాల హృదయులు, ఆయన అల్లునిలాంటి అభ్యు దయ వాదులు మన సంఘంలో యింకా యింకా తయారవ్వాలి. అప్పుడే మనదేశం ప్రగతిపథాన పురోగ మిస్తుంది......" జన మంతా చప్పట్లు కొట్టారు.

కౌన్సిలర్‌గారి మాటలు వినేసరికి సింహా చలానికి పిచ్చెక్కినట్లయింది.

'ఏమిటో. ఈ మాయదారి పెపెంచకం. సేసినపని ఒకటే అయినా ఒకరికి సివాట్లు, సెప్పుదెబ్బలు! మరొకరికి సప్పట్లు, సెమ్కీ దండలు...... మడిసికో నాయం..." అని గొణుక్కుంటూ తోటలోకి వెళ్లాడు సింహాచలం.



# విషాద నేత్రాలు -


నన్ను నమ్ము చిట్టీ - నేను తాగలేదు - కళ్ళ జబ్బొచ్చి కళ్ళు ఎర్రబడ్డాయంతే - నిజం -


కంగారు పెట్టేస్తున్నావా - ఇప్పటికైనా అమ్మాయిమీద చేయి చేసుకుని కంట తడి పెట్టించగలిగావే!
ఊ - ఎంతదృష్టం కూడానా నాయనా! మా అమ్మకు కళ్ళజబ్బొచ్చి నీళ్ళొస్తున్నాయి!!


నా కళ్ళలోకి సూటిగా చూసి చెప్పు సుశీ - నామీద నిర్మలంగా ప్రేమలేదా నీకు?
బాబోయ్ ప్రేమమాట దేవుడెరుగు - కళ్ళలోకి మాత్రం చూడమనక్క చూడనంతే!



అబ్బే - అదేం కాదు - వాడికి కళ్ళజబ్బొచ్చింది!
ఏమిటా పాపం - వాడికి పెళ్ళి ఇష్టం లేదా - అలా కన్నీరుమున్నీరుగా ఏడుస్తున్నాడు?




హీరోయిన్ రేప్ సీన్లో మీ కళ్ళలో ఎర్ర జీర స్పష్టంగా కనిపించింది - అదెలా సాధ్యం?
వెరీ సింపుల్ - అప్పుడు నాకు కళ్ళజబ్బొచ్చింది!


ఏం చేయను మరి -
నా బామ్మరిది పోయినప్పుడు పాపం కొట్టాడిష్టుకు కళ్ళజబ్బొచ్చి సరిగా కనిపించక ఇలా గెంతాడు --



# వారఫలం

— మహేష్

## 3-10-1975 శుక్రవారం మొదలు 9-10-1975 గురువారం వరకు

**మేషం :—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలుబాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలుఫలిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది.స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. విలాస వస్తువులు కొంటారు.

**సింహం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది.అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు— నూతన విషయాలనుతెల్సుకొంటారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** వృత్తిలోఆదాయం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో సాటివారి పోటీతగ్గుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల :—** అనవసరమైన శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. భాగస్వామ్యంతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం —** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభించగలవు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలుబాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం :—** రావలసిన డబ్బు అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనకరమైన సంభాషణలను జరుపగలరు. మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో శ్రమ కలుగుతుంది.వారం మధ్యలో అనుకూలమైన వార్తలనువింటారు. ప్రయాణాలు ఫలించగలవు. అధికారుల వలనజరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైనవార్తలను వింటారు.

**మీనం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి.ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

సకాలానికి విధులకు హాజరు కావడం ఉద్యోగుల విధి.
వ్యాపారంలో నిజాయితీ ప్రజారోగ్యానికి పరమావధి.

# అవీ-ఇవీ-అన్నీ

## వెంట వెంటనే రక్తాన్ని శుద్ధిచేసే సాధనం

అమెరికాలో, ఒక పరిశోధన కేంద్రం రక్తాన్ని శుద్ధి చేయటానికి ఒక సరికొత్త సాధనాన్ని రూపొందించింది. ఇర్విన్(కాలిఫోర్నియా రాష్ట్రం) లోని ఈ లేబరేటరీ తయారు చేసిన ఈ యంత్రం, రోగి, తన దేహం నుంచి శస్త్రచికిత్స సమయంలో కోల్పోయే రక్తాన్ని కూడదీసి, వెంట వెంటనే పరిశుభ్రపరచి తిరిగి రోగికి అందచేస్తుంటుంది. ఈ యంత్రంలో పీల్చుకొనే ఒక ప్లాస్టిక్ గొట్టం అమర్చిన ఒక పంపింగ్ సాధనం ఉంటుంది. పొట్టలో తుపాకి గుండు దెబ్బ తగిలినప్పుడు జరగవలసిన క్లిష్టమైన శస్త్ర సమయంలో ఈ ప్లాస్టిక్ గొట్టాన్ని పొట్టలోకి దింపుతారు. అక్కడి నుంచి చిందే రక్తాన్ని ఈ గొట్టం పీల్చి ఈ యంత్రానికి అందజేస్తుంటుంది. ఈ విధంగా పీల్చిన రక్తంలో బుడగలు, గాజు పెంకులు, గుడ్డ ముక్కలు, ఇతర మాలిన్యాలు యంత్రంలోని, పరిశుభ్రపరచే ఒక భాగంలోనికి చేరి అక్కడ శుద్ధి చేయబడి తిరిగి రోగి దేహంలోనికి జాగ్రత్తగా తగు మాత్రపు పరిమాణాలలో మెడ దగ్గర ఉండే పెద్ద నరం వంటి నరాల ద్వారా ఎక్కించబడుతుంది. ఈ విధమైన ప్రమాదాలలో ఎక్కువ స్థాయిలో రక్తాన్ని కోల్పోయినప్పుడు మిగిలిన రక్తంలో గడ్డ కట్టుకునే శక్తి క్షీణిస్తుంది. అందు కోసం గడ్డ కట్టి ఉన్న ప్లాస్మాను రోగి దేహం లోనికి ఎక్కిస్తారు. ఈ ప్లాస్మాలో గడ్డ కట్టు కొనే స్వభావం గల పదార్థం ఉంటుంది. వెడి పోయిన మూత్ర పిండాన్ని అమర్చిన తరువాత కొత్త చిక్కులు ఏర్పడిన ఒక స్త్రీ దేహంలోనికి ఇంతవరకూ అత్యధిక స్థాయిలో— అంటే 18 లీటర్ల రక్తాన్ని ఈ పద్ధతి ద్వారా అంద చేయటం జరిగింది. ఇలాంటి యంత్రాన్ని అన్ని రకాల శస్త్ర చికిత్సలకు పనికి వచ్చేటట్లు ఒక స్థిరమైన యంత్రంగా తయారు చేసినట్టయితే, ప్రస్తుతం బ్లడ్ బ్యాంకులపై వస్తున్న ఒత్తిడిని మూడింట రెండు వంతులు తగ్గించవచ్చునంటున్నారు.

## 'బ్లూ బర్డ్' – సోవియట్ – అమెరికాల సంయుక్త చలనచిత్రం

చలనచిత్ర నిర్మాణంలో భారత సోవియెట్‌దేశాల మధ్య సహకారం ఉన్న విధంగానే సోవియెట్ యూనియన్ ఇతర దేశాలతో కూడా కలసి చలన చిత్రాలు నిర్మిస్తోంది.

సోవియెట్ యూనియన్- అమెరికాలు త్వరలో 'ది బ్లూ బర్డ్' అన్న చిత్రాన్ని సంయుక్తంగా నిర్మించబోతున్నాయి. ఇది సంగీత ప్రధానమైన చిత్రం.

లెనిన్‌గ్రాడ్ ఫిలిమ్ స్టూడియోస్ ఈ చిత్రాన్ని నిర్మిస్తుంది. ప్రఖ్యాత అమెరికన్ దర్శకుడు జార్జి కుకర్ ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తారు. జొనాస్ గిసియన్ (సోవియెట్ యూనియన్) ప్రెడ్డీయంగ్ (అమెరికా) కెమెరా డైరెక్టర్లు ఇందులో ఉభయ దేశాలకు చెందిన నటీనటులు పాల్గొంటారు. సోవియెట్ యూనియన్‌కి చెందిన మియాప్లిసెట్స్కాయా అమెరికాకు చెందిన ఎలిజబీత్ టేలర్, జేన్ ఫోండాలు నటిస్తున్నారు. ఇందులో ప్రధాన భూమికను ఒక యువ బాలే నృత్యకారిణి నాద్యాపావ్లోవా ధరిస్తున్నారు.

# అవీ ఇవీ అన్నీ

## రెండు నాటికలు

పగబట్టిన సమాజం, మతిలేని మనుషులు. రచన శ్రీ దాసరి సోమశేఖరరెడ్డి. 70 పేజీలు. వెల మూడు రూపాయలు. ప్రతులకు విశ్వశ్రీ పబ్లికేషన్స్, పోస్టాఫీసువద్ద, మెయిన్‌రోడ్డు, ధవిళేశ్వరం.

## తొలకరి జల్లులు

ఖండకావ్య సంపుటి. రచయిత్రి శ్రీమతి చోడవరపు సత్యవతిదేవి. 80 పేజీలు. వెల నాలుగు రూపాయలు. ప్రతులకు: శ్రీ చోడవరపు రాఘవాచారి, గవర్నరుపేట, విజయవాడ—2.

## విధి విరిసిన బొమ్మలు

నవల. రచన శ్రీ ఎం. పి. చంద్రశేఖర్‌రెడ్డి,: 216 పేజీలు, వెల 7 రూపాయలు. ప్రచురణ సుదర్శన పబ్లికేషన్స్, అనంతపురం.

## ఐ. ఐ. టి. లో తెలుగు కార్యక్రమాలు

ఇటీవల ఖర్గపూర్‌కి సమీపంలో ఉన్న ఐ. ఐ. టి. లో ఆంధ్ర సారస్వత సంఘంవారు నూతన సభ్యుల పరిచయ సమావేశ కార్యక్రమం జరిపారు. ఈ సందర్భంగా శ్రీ సి. నా. రె. రాసిన లలిత గీతాల సంగీత కార్యక్రమం జరిగింది. 'సినారె' గీతికల్ని కుమారి ఎన్. దమయంతి మృదుమధురంగా పాడింది. అనంతరం, రెండు నాటికలు ప్రదర్శించబడినాయి.
ఓ. వి.

## భూకంపాన్ని నీటితో పట్టుకోడం?

భూకంపాల గురించి జోస్యం చెప్పడంలో నిమగ్నులయిన సోవియట్ బాల్టిక్ రిపబ్లిక్ అయిన ఇస్తోనియాలో భూభౌతిక శాస్త్రజ్ఞులు భూకంపం సంభవించడానికి ముందు సాధారణంగా భూమిపై బెరడుకు వచ్చే ఒత్తిడులను ఇటీవల నమోదుచేశారు. ఈ ఒత్తిడుల సూచనలు అత్యంత సూక్ష్మమైనవి అయినందువల్ల ఎల్లప్పుడూ వాటిని శాస్త్ర పరికరాల ద్వారా నమోదు చేయడం సాధ్యంకాదు. అందుచేత దీనిని నమోదు చేసే నిమిత్తం తర్తులోని ఖగోళ భౌతిక పరిశీలన కేంద్రంలోని నిపుణులు భూగర్భంలోని నీటివనరుల మట్టాన్ని పరిశీలించే బ్రహ్మాండమైన సాధనాన్ని వుపయోగించుతున్నారు. అందుకోసం ద్రవ పదార్థంతో నింపబడిన రెండు కిలోమీటర్ల పొడవుగల ప్లాస్టిక్ గొట్టాన్ని భూమి అడుగున ప్రవేశపెట్టారు. ఈ గొట్టం యొక్క రెండు కొనలలోనూ భూగోళపు బెరడులో సంభవించే అత్యంత సున్నితమైన ప్రకంపనలను నమోదు చేసే స్వయం చలిత పరికరాలను అమర్చారు. దాని టేపు మీద నమోదు అయే ప్రకంపన రేఖలను పరిశీలించడం ద్వారా రానున్న భూకంపాలను గురించి జోస్యం చెప్పడం సాధ్యమవుతుంది.

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street. Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# సినీ బొమ్మల కొలువు



"పిచ్చిమారాజు"లో మంజుల

"ఒక అమ్మాయి కథ"లో విజయలలిత



Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA

శ్రీ విజయభట్ ప్రొడక్షన్సు

# గుణవంతుడు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకుడు

ఆదుర్తి సుబ్బారావు

నిర్మాతలు

యస్.యస్. భట్

యస్.యస్. మూర్తి



అన్నపూర్ణా ఫిలింస్

ANNAPURNA

alpana